శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ
సమర్పించు



అన్నపూర్ణ స్టూడియోస్

# విక్రమ్

నిర్మాత
వెంకట్ అక్కినేని

దర్శకత్వం:
వి.మధుసూదనరావు

సత్యానంద్. చక్రవర్తి. పి.యస్.సుందరం వెంకటరత్నం

ప్రొద్దునపూట నవ్యోత్సాహానికి ఒక నూతన పద్ధతిని అలవరచుకోండి..




ట్రస్ట్ మార్నింగ్

టూత్‌పేస్టు మీకు నవ్యోత్సాహాన్ని ఆహ్లాదాన్ని చేకూర్చగలదు

ప్రతి నిత్యం ప్రొద్దున్నే మీ పళ్ళను ట్రస్ట్ (మార్నింగ్) టూత్‌పేస్టుతో పరిశుభ్రంగా తోముకోండి. ట్రస్ట్ టూత్‌పేస్టులో ఇమిడివున్న శక్తివంతమైన మిశ్రమము మీ పళ్ళను సంపూర్ణంగా శుభ్రపరచి ధళధళలాడుతూ, ప్రకాశింప జేయగలదు. ట్రస్ట్ టూత్‌పేస్టు నోటిలోని దుర్గంధాన్ని, దంతక్షయాన్ని నిర్మూలించి, శ్వాసను సువాసనలీనుతూ చేయగలదు. ట్రస్ట్‌తో పళ్ళు తోముకొనే సద్భ్యాసాన్ని వెంటనే అలవరచుకోండి

ట్రస్ట్... దీనిని దిన చర్యగా పాటించండి.

JAGATI Rs. 2-00 August 1986

31st Year of Publication




ఆగస్టు - 1986



బస్సు ప్రయాణం

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 20–00, 2 సం॥లకు 38-00, 5 సం॥లకు రు. 85-00. జీవిత చందా రు. 300-00, విదేశాలకు 2 సం॥లకు రు. 85–00

ముఖచిత్రం: బాబా ఆమె

# నిమ్మతొనలు

షాపులో రెయిన్ కోటు మర్చి పోయిన సదాశివరావు వెనక్కివచ్చి షాపు వోనరుని తన రెయిన్ కోటు అడిగాడు.

ప్రొఫెసర్ సదాశివరావు మతి మరుపు మనిషి అని తెలిసిన షాపు వోనరు 'మీకీ రెయిన్ కోటు సంగతి ఎప్పుడు జ్ఞాపకం వచ్చింది, సార్' అని అడిగాడు కుతూహలంతో.

'వర్షంలో వెళ్లానా, తీరా వర్షం వెలి శాక, రెయిన్ కోటు మడత పెడదామ నుకుంటే, అది వొంటిమీద లేదు'– అని చెప్పాడు సదాశివరావు.

—పవన్ కుమార్
నరసరావుపేట

రోజూ సంగీతానికెళ్తున్నావీ మధ్య– ఇవ్వాళ ఏం రాగం నేర్చుకుంటా వు?– అని అడిగింది తల్లి, కూతురు రాధని.

అనురాగం అనబోయి నాలిక కరు చుకు 'మోహన రాగం' అంది రాధ.

—ఇ భవాని
మచిలీపట్నం-2

ఇవ్వాళ పొద్దుట లేవగానే పక్కింటి వారి పిల్లి ముఖం చూశాను – అన్నాడు భర్త, భార్యామణితో.

'మీ దృష్టి పడేకాబోలు, అంత ముద్దొచ్చే పిల్లిపిల్ల, కారు కింద పడి గుటుక్కుమన్నది'.

—కె నాగేశ్వర్రావు
నర్సారావుపేట

మూడు రోజుల నుంచి అది కన బడటం లేదు. ఏ పని చేదామన్నా తోచదు. లోకమంతా....' ఇంకా చెప్ప బోతున్న శ్రీనివాసరావుని కొరకొరా చూస్తూ, 'ఎవరండీ ఆ అది?' అని దండించింది పద్మావతి.

'అదే, అదే, అది'– అని నసిగాడు శ్రీనివాసరావు.

'ఎవరండీ ఆ అది? పళ్లూడ గొడ్తా ను. మీ ఆఫీసులో పంకజవల్లా?'

'అయ్యో, అయ్యో.... కళ్లజోడు'.

—బి వెంకటేశ్వర్రావు
విశాఖపట్నం-29

పెళ్లంటే నూరేళ్లపంట– అని హుషా రుగా పాడుతున్నాడు గోపీ.

పక్కగదిలో నుంచి గోపీ తండ్రి వచ్చి, కుమారుని ఉద్దేశిస్తూ అన్నాడు: 'వెర్రినాగమ్మా, పెళ్లి అంటే నూరేళ్ల వంటరా'

—జి రాము
నందిగామ

పిల్లలెలాగూ పాఠాలు వినరు గనక పొడుపు కథలతో పాఠంచెప్పే అలవాటుగల టీచరు సంగమేశ్వరం, 'ఎవరూ తినడానికి పనికిరాని ఫలాలేమిటో చెప్పు?' అని కిరణ్‌ని అడిగాడు.

కిరణ్ ఠక్కున చెప్పాడు: 'వార ఫలాలు'

—డి సత్యమూర్తి
వాడ్రేవుపల్లి

ఈ రోజుల్లో ఈ కవితలు చదివేదెవరయ్యా? - అన్నాడు రాంబాబు, ఎదుట మనిషిని నిరుత్సాహ పరుస్తూ.

ఎదుట మనిషి చిరునవ్వుతో 'నా భార్యండి' అన్నాడు.

'ఆవిడకు కవిత్వ మంత యిష్టమా? ఇంతకీ ఎవరు రాశారు ఈ తలాతోకాలేని కవితలు?' - అని రెట్టించాడు రాంబాబు.

'నేనేనండి' – అన్నాడా కవి, చిరునవ్వుతో.

రాంబాబు నోటమాటలేదు.

—పి బాలసుందర్రావు
ఫిరంగిపురం

సారీ ఆనంద్, నీ పెళ్లికి రాలేకపోయాను. అదే ముహూర్తాన మా మరదలు పెళ్లి కూడా. తన చెల్లెలి పెళ్లికి రాకపోతే మా ఆవిడ వూరుకోదు. ఫ్రెండువి కాబట్టి నువ్వు అర్థం చేసుకోగలవు....' - అంటూ అడగని సంజాయిషీ చెప్పాడు ఏకాంబరం, ఏడాది తర్వాత కలుసుకున్న ఆనంద్‌కి.

'దట్సాల్ రైట్, దట్సాల్ రైట్.. పెళ్లిచేసుకోవడం, విడిపోవడం రెండూ అయిపోయాయి.... ఈసారి పెళ్లికి తప్పకుండా రావాలి, నెక్స్‌ట్ మంత్' - అన్నాడు ఆనంద్.

—కృష్ణశ్రీ
తెనాలి



# పాఠకుల తీర్పు

మాన్యశ్రీ చందూర్‌జీ నమస్తే. 'జగతి' ప్రగతి పథంలో పయనించటం ముదావహం. క్రొత్త పాతల మేలులకయికగా ఉంటున్నది. శీర్షికల పేర్లు చక్కగా వుండటమేగాక మెదడుకి మేతవేస్తూ, అన్నిరకాల పాఠకులని అలరిస్తున్నాయి. 'డైరీ' హైలైట్ కుడోస్ 'జగతీ డియర్'

—పి మోహన్
కోరుకొండ

గౌరవనీయులైన ఎడిటర్ గారికి నిర్మల నమస్కరించి వ్రాయునది. పత్రికా ప్రపంచంలో 'జగతి' చూపులకి చిన్నపత్రికైనను, వినోద విజ్ఞాన దాయకం. నిమ్మతొనలు, వెన్నెలకెరటాలు, చిత్ర సమీక్షలు, మీ డైరీ — అన్నీ రత్నమాణిక్యాలు, ఎన్నో విలువైన విషయాలు. పాఠకులకు ఎంతో ఆసక్తికరంగా ఉంటున్నది. త్వరలో ఈ పత్రిక పక్షపత్రికగా రావాలని ఎదురు చూస్తున్నాము.

—కె నిర్మల
బాగలూరు

'జగతి' ఎడిటర్ చందూర్‌గారికి నమస్కారములు. ఇంత తొందరగా చదవడమై పోయిందా అనిపిస్తుంది ప్రతినెలా .... ముఖచిత్రాల ప్రత్యేకతకు నా అభినందనలు. ఎన్నో కొత్త విషయాలు తెలియజేస్తున్నారు. ముఖ్యంగా 'మానవప్రగతి' నాకెంతో నచ్చుతుంది. నిమ్మతొనలు తియ్యగా పుల్లగా వుంటూ నవ్విస్తాయి.

—కె నారాయణరావు
గోపాలపట్నం

చందూర్ గారికి: నమస్కారములు. తెలుగు పాఠకులు అచ్చు తప్పులకి అలవాటు పడ్డారు. ఇన్నాళ్లూ మీ పత్రికలో తక్కువ తప్పులు వుంటున్నాయని అనుకొనేదాన్ని. కాని, ఈ మధ్య అచ్చు తప్పులు 'జగతి'లో కూడా మోతాదు మించి వుంటున్నాయి. పాఠకురాలిగా శ్రేయోభిలాషిగా ఈ విషయం మీ దృష్టికి తేవాలని యిది రాస్తున్నాను.

—అర్ శ్యామల
కాకినాడ–3

ఎడిటర్ చందూర్ గారికి నమస్కారములు. 'పాఠకుల తీర్పు' శీర్షికలో, మిమ్మల్ని మెచ్చుకొనే లేఖలే తప్ప, విమర్శించేవి వేయటం లేదు. విమర్శనాత్మక లేఖలు రావా? లేక మీరు వేయరా?.... ఏమైనా 'జగతి' నాకు నచ్చే పత్రికలలో ఒకటి - మీది అభినందనీయ మగు కృషి.

—కె గోపీనాథ్
కర్నూలు–2

# ప్రాచీన సాహితి

కలవు పచేళిమంబు లయి కానలలోపల బండ్లు మ్రాకులం
గలవు పవిత్రవాహినుల గమ్మని శీతల వారిపూరముల్
గలవు చివుళ్ల పాన్పులవి గైకొననేరక దీనులై ధనా
ఢ్యుల గవనిన్ వసించి నరులోలి సహింతురు తీవ్రతాపమున్

—భర్తృహరి



కెలకులనున్న తంగేటి జున్ను గృహమేధి
యజమాను డంకస్థితార్థ పేటి
పండిన పెరటి కల్పకము వాస్తవ్యుండు
దొడ్డి బెట్టిన వేల్పు గిడ్డి కాపు
కడలేని యమృతంపు నడబావి సంసారి
సవిధ మేరు నగంబు భవన భర్త
మరు దేశ పథ మధ్యమ ప్రప కులపతి
యాకటి కొదవు సస్యము కుటుంబి
బధిర పంగ్వంధ భిక్షుక బ్రహ్మచారి
జటి పరివ్రాజ కాతిథి క్షపణ కావ
ధూత కాపాలికా ద్యనాథులకు గాన
భూసురోత్తమ గార్హస్థ్యమునకు సరియె

—పెద్దన 'మనుచరిత్రం'



దక్షుడు లేనియింటికి బదార్థము వేఱొక చోటనుండి వే
లక్షలు వచ్చుచుండిన బలాయనమై చను గల్లకాదు ప్ర
త్యక్షము వాగులున్ వఱదలన్నియు వచ్చిననీరు నిల్చునే
యక్షయ మైనగండి తెగినట్టి తటాకములోన భాస్కరా

—భాస్కర శతకం

# పాత కాలపు  పిక్చర్

## సారధి వారి 'కలసి ఉంటే కలదు సుఖం'

భద్రాద్రి రాముని ఆంధ్ర ప్రేక్షక హృదయంపై నిలుపుతూ మేలిమి బంగరు మెలిక తిరిగినా, విలువ తరగ దంటూ చెప్పుకుపోయే ఈ రసవత్తర చిత్రం, నేటి సమాజ స్వరూపాన్ని గాని సమస్యలని గాని ఏవిధంగాను ప్రతి బింబించనప్పటికీ, నిర్ణయించుకున్న పరిధిలో రమ్యంగా సాగిపోతుంది. చిన్నతనంలో ఎలక్ట్రిక్ షాక్ వల్ల వచ్చిన అవిటితనం, పెద్దయాక తిరిగీ మరొక ఎలక్ట్రిక్ షాక్‌తో పోవడ మన్నది, ఈ చిత్రకథ కోసం ప్రవేశ పెట్టిన 'మిరకిల్'గా భావించాలి మనం. తాపీ చాణక్య చిత్రాలలో 'రోజులు మారాయి' తర్వాత అంత రసవత్తరంగానూ వుంది .... అన్నదమ్ములైన పట్టాభిరామయ్య (యస్వీ. రంగారావు), సుందర రామయ్యలు (పెరుమాళ్లు), కలిసి వుండేవాళ్లు. సుందరరామయ్య పెద్దకొడుకు అవిటి కిష్టయ్య అంటే, (యన్.టి. రామారావు) పెత్తండ్రికి ఎంతో ప్రేమ. పట్టాభిరామయ్య భార్య సౌభాగ్యమ్మ (సూర్యకాంతం), రంగూన్ రాజాకి (రేలంగి) మేనత్త అవుతుంది. ఆ రాజా తన చెల్లెలు జానకిని (గిరిజ) సుందరరామయ్య రెండోకొడుకు రఘుకి (హరనాథ్) యిచ్చి పెళ్లిచేసి, అద్భుతమైన ప్లానుతో ఉమ్మడి కుటుంబాన్ని రెండుగా చీలుస్తాడు. దిక్కులేని పిల్ల రాధ (సావిత్రి) కిష్టయ్యని చేసుకొంటుంది. నెత్తిన చేయి పెట్టడంలో నేర్పరియైన రంగూన్ రాజా యిటు మేనత్తని అటు బావమరిదిని నట్టేట ముంచుతాడు. వివరి కందరూ ఈదుకుంటూ బయటి కొస్తారు .... యన్.టి. రామారావు తన పాత్రని చాలా గొప్పగా పోషించాడు. తాడూ బొంగరం లేని కృత్రిమ జీవనం రంగూన్ రాజాది. ఈ సంగతి కిష్టయ్యా, అతని పెత్తండ్రీ ముందే కనిపెడతారు. కాని, సౌభాగ్యమ్మ దూకుడుని ఎదిరించగల శక్తి లేదు వారికి. ఆస్తులు పంచుకున్న కుటుంబాలు తిరిగి కలవడమన్నది సత్యవిదూరం. నీతి నిరూపణ కోసం వారిని కలిపినట్టు ఉన్నదేతప్ప కథా సంవిధానం విషాదాంత పరిణామం వైపుగా మొగ్గుతోంది. ఈ మధ్య కాలంలో యింత చక్కటి చిత్రం రాలేదు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' — ఆగస్టు 1961

---

ఇతరులకి మంచి చేయడం చేతగానపుడు మీకు మంచి జరగదు. అధిక ధనం కోసం గాక ఆనందం కోసం అన్వేషించండి. ధనమేనాడు మీరు కోరే తృప్తినివ్వలేదు.

—విలియమ్ పెన్

# వెన్నెల కెరటాలు

## షేర్లు

గోదావరి ఫెర్టిలైజర్స్ అండ్ కెమికల్స్ లిమిటెడ్ అతి త్వరలో కంపెనీ వాటాలను ప్రజలకు అమ్మకం చేయడానికి రంగం సిద్ధం చేశారు. ఈ షేర్లు కోసం వచ్చిన వేలాది దరఖాస్తుల్ని పరిశీలించి డైరెక్టర్ల సమావేశంలో వాటాల కేటాయింపు (ఎలాట్‌మెంట్) చేస్తారు. ఈ ప్రక్రియలో కొంతమందికి అడిగిన వాటిలో కొంతశాతం మాత్రమే దక్కవచ్చును. ఈ తతంగం పూర్తయిన తర్వాత షేర్లు మార్కెట్లో కొస్తాయి. కొంతమంది అమ్మకానికి పెడతారు. కొందరు కొనడానికి ముందు కొస్తారు. ఈ బేరసారాల్లో షేరురేటు మారుతుంది. కనీసం మూడురెట్లు అధికంగా మార్కెట్ ధర పలకవచ్చునని అంచనా వేస్తున్నారు. అంటే పది రూపాయల షేరు మార్కెట్లో ముప్ఫయ్ నుంచి నలభై రూపాయల వరకూ వుండవచ్చును. అంటే పెట్టుబడిదారుకు వాటా ఒక్కంటికి పైన వచ్చే పాతిక రూపాయలు 'మూలధనం లాభం' అన్నమాట. పెట్టుబడి పెట్టిన కొద్దిరోజులకే మూడు నాలుగు రెట్లు లాభం రావడం ఇతరవాటికి రాదు. అది ఒక్క షేర్ మార్కెట్‌కే చెల్లుతుంది. 'విమల్' బట్టలు తయారుచేసే రిలయన్స్ కంపెనీ పదిరూపాయల షేరు ఈరోజు మార్కెట్లో నాలుగు వందలు పలుకుతున్నదంటే పెట్టుబడి ఎన్ని రెట్లు పెరిగిపోయిందో సులభంగా ఊహించుకోవచ్చును. దేశంలో ఎరువులకు మంచి మార్కెట్ వుండడంవల్ల ఎరువుల కంపెనీలు మంచిలాభాలు గడిస్తున్నందువల్ల ఫెర్టిలైజర్ కంపెనీ షేరు రేట్లు కూడా ఎక్కువధర పలుకుతున్నాయి.

—సంపాదకీయం
'సర్కార్ ఎక్స్‌ప్రెస్'

## ఎవరికి కావాలి?

రాత్రుళ్ళు నిద్ర మేల్కొని కూడా విపరీతంగా కథలు చదివే అలవాటు చిన్నప్పటినుంచి వుండటంచేత ఆ రోజుల్లోనే నాకూ కథలు రాయాలనిపించేది. రాసాను కూడా! నా రూమ్ మేట్స్ మాటల్లో ఏదైనా నాకు నచ్చకపోతే 'దీన్ని గురించి కథ రాస్తాను చూడు!' అని ఏదో పందెం వేసుకున్నట్లు ఒక కథ అల్లేదాన్ని. అవన్నీ నవ్వులాటగా రాసినవి. నేను సీరియస్‌గా రాసిన కథ 'అపశృతి' (1945). ఓ రాత్రి చంద్రుణ్ణి, నక్షత్రాలను చూస్తుంటే, వాటి చుట్టూ కథ అల్లితే బాగుంటుందనిపించింది. చంద్రుడు కలువను ప్రేమిస్తాడు. కాని దానికోసం నక్షత్రాలను వదులుకోలేడు. కల్యా

## మానవ ప్రగతి

### స్పేస్‌షటిల్

వచ్చే ఏడాది అంటే 1987 జులై 15న మరొక 'స్పేస్‌షటిల్'ను ప్రయోగించాలని అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ (నాసా) అధికారులు సిఫారసు చేశారు. గత జనవరి 28న 'ఛాలెంజర్' దుర్ఘటనలో ఏడుగురు వ్యోమగాములుమృతిచెందినఅనంతరం అమెరికా, రోదసి విమానం – (స్పేస్ షటిల్, - ప్రయోగాలను వాయిదా వేసింది. వచ్చేఏడాది ప్రయోగించే స్పేస్ షటిల్ ద్వారా రెండవసమాచారప్రసార ఉపగ్రహాన్నికక్ష్యలో ప్రవేశ పెడతారు. మొదటిఉపగ్రహాన్ని1983లో'ఛాలెంజర్' తొలియాత్ర సందర్భంగా కక్ష్యలోకి పంపారు. గత జనవరిలో కక్ష్యలోకి పంపదలచిన ఉపగ్రహం 'ఛాలెంజర్' తోపాటు భస్మీపటలమైపోయింది. షటిల్ బూస్టర్ రాకెట్ల కొత్త నమూనా కోసం 75 మంది పరిశోధకులు కృషి జరుపుతున్నారు. స్పేస్‌షటిల్ ప్రయోగానికి కొద్ది నిమిషాలముందు, ప్రయోగించిన కొద్ది నిమిషాలలోపు షటిల్ వ్యవస్థలో ఏదైనా ప్రమాదకరస్థితి ఏర్పడితే అందరి వ్యోమగాములు తక్షణం బయట పడగల మార్గాలను విశ్లేషించేందుకై ప్రత్యేక పరిశోధన జరుగుతున్నది. భూమినుంచి ప్రయోగించిన తర్వాత 73 సెకండ్లకు ప్రేలిపోయిన వెనకటి 'ఛాలెంజర్'లో వ్యోమగాముల భద్రతకు ఎటువంటి ఏర్పాట్లు లేవు. విపత్కరస్థితిలో వ్యోమగాములు బయట పడేందుకు వీలుకల్పించే నదుపాయాలకోసం షటిల్ నమూనాను ఆధునికీ కరించే ప్రయత్నం జరుగుతున్నది. 'ఛాలెంజర్' ప్రమాదం అనంతరం మిగిలిన మూడు 'స్పేస్ షటిల్స్' ఆధునికీకరణకై కనీసం 67.60 కోట్ల డాలర్ల మొత్తం అవసరమవుతుందని 'నాసా' వారు అంటున్నారు. 1992 లోగా అమెరికన్ స్పేస్‌షటిల్స్ ద్వారా మొత్తం 32 గ్రహాలను ప్రయోగించవలసి వుంది.

### బీడు

సారం క్షీణించి బీడుపడిపోతున్న పంటభూముల విస్తీర్ణం ఇటీవల ఆందోళనకరమైన స్థాయికి చేరుకుంటున్నది. మొత్తం దేశంలోని భూమిలో సగ భాగంలో సారం క్షీణించినట్లు తేలింది. ఈ సారక్షీణత వివిధ ప్రాంతాలలో

# మానవ ప్రగతి

## స్పేస్‌షటిల్

వచ్చే ఏడాది అంటే 1987 జులై 15న మరొక 'స్పేస్‌షటిల్'ను ప్రయోగించాలని అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ (నాసా) అధికారులు సిఫారసు చేశారు. గత జనవరి 28న 'ఛాలెంజర్' దుర్ఘటనలో ఏడుగురు వ్యోమగాములుమృతిచెందినఅనంతరం అమెరికా, రోదసి విమానం – (స్పేస్ షటిల్, - ప్రయోగాలను వాయిదా వేసింది. వచ్చేఏడాది ప్రయోగించే స్పేస్ షటిల్ ద్వారా రెండవసమాచారప్రసార ఉపగ్రహాన్నికక్ష్యలో ప్రవేశ పెడతారు. మొదటిఉపగ్రహాన్ని1983లో'ఛాలెంజర్' తొలియాత్ర సందర్భంగా కక్ష్యలోకి పంపారు. గత జనవరిలో కక్ష్యలోకి పంపదలచిన ఉపగ్రహం 'ఛాలెంజర్' తోపాటు భస్మీపటలమైపోయింది. షటిల్ బూస్టర్ రాకెట్ల కొత్త నమూనా కోసం 75 మంది పరిశోధకులు కృషి జరుపుతున్నారు. స్పేస్‌షటిల్ ప్రయోగానికి కొద్ది నిమిషాలముందు, ప్రయోగించిన కొద్ది నిమిషాలలోపు షటిల్ వ్యవస్థలో ఏదైనా ప్రమాదకరస్థితి ఏర్పడితే అందలి వ్యోమగాములు తక్షణం బయట పడగల మార్గాలను విశ్లేషించేందుకై ప్రత్యేక పరిశోధన జరుగుతున్నది. భూమినుంచి ప్రయోగించిన తర్వాత 73 సెకండ్లకు ప్రేలిపోయిన వెనకటి 'ఛాలెంజర్'లో వ్యోమగాముల భద్రతకు ఎటువంటి ఏర్పాట్లు లేవు. విపత్కరస్థితిలో వ్యోమగాములు బయట పడేందుకు వీలుకల్పించే సదుపాయాలకోసం షటిల్ నమూనాను ఆధునికీకరించే ప్రయత్నం జరుగుతున్నది. 'ఛాలెంజర్' ప్రమాదం అనంతరం మిగిలిన మూడు 'స్పేస్ షటిల్స్' ఆధునికీకరణకై కనీసం 67.60 కోట్ల డాలర్ల మొత్తం అవసరమవుతుందని 'నాసా' వారు అంటున్నారు. 1992 లోగా అమెరికన్ స్పేస్‌షటిల్స్ ద్వారా మొత్తం 32 గ్రహాలను ప్రయోగించవలసి వుంది.

## బీడు

సారం క్షీణించి బీడుపడిపోతున్న పంటభూముల విస్తీర్ణం ఇటీవల ఆందోళనకరమైన స్థాయికి చేరుకుంటున్నది. మొత్తం దేశంలోని భూమిలో సగ భాగంలో సారం క్షీణించినట్లు తేలింది. ఈ సారక్షీణత వివిధ ప్రాంతాలలో

వివిధ స్థాయిలలో ఉండి వ్యవసాయం పైనా, పచ్చిక బీళ్లపైన, అడవులపైనా దుష్ట ప్రభావాన్ని కన్పరుస్తున్నది - అంటే వీటి ఉత్పాదకత దెబ్బతిని పోతున్నది. అటవీభూములు, పచ్చిక బయళ్లు, ఉమ్మడి బయళ్లు, సారహీనం కావడంతో అడవులు క్షీణించడంతో పాటు పారిసర్య సంబంధమైన సమతూకం దెబ్బతిని ప్రకృతి వైపరీత్యాలు సంభవిస్తున్నాయి. మన అశ్రద్ధ, నిర్లక్ష్యం వల్లనే సువిశాలమైన ఈ భూములు నిస్సారమై బీడుపడిపోవడం జరిగింది. దేశంలో జనాభాతోపాటు, పశుగణం సంఖ్య కూడా పెరిగింది. పారిసర్య సమతూకమ పరిస్థితి బొటాబొటీగా ఉన్న ప్రాంతాలలో చెట్లను నరకడం పెద్ద ఎత్తున సాగిపోవడం, పశుగ్రాసాన్ని అతిగా వాడివేయడం, బంగారం వంటి అటవీ భూములను పరిశ్రమలకుగాను మళ్లించి చెట్లను నరికివేయడం. ఆయా భూములకు అనుకూలంకాని సేద్యమ విధానాలను అనుసరించడం వంటివి భూములు బీడుపడిపోవడానికి కారణమయ్యాయి. సాంకేతిక పరిభాషలో అయితే నేల పైపొర కొట్టుకుపోవడం, మురుగునీరు నిల్వకావడం, నేలలో ఆమ్ల, క్షారలక్షణాలు పెచ్చరిల్లడం, పోడు వ్యవసాయం, భూములు బీడుపడటానికి కారణాలుగా చెపుతారు. మనదేశంలో బీడు భూములకు సారహీనమైన భూములకు సంబంధించిన భోగట్టా అంతా ఉజ్జాయింపు లెక్కలపైఆధారపడిందే. అయితే భూములు బీడుపడటం అన్నది ప్రధానంగా మానవకృతమేనన్న విషయాన్ని వి
ర్శించజాలం. ఈ బీడు భూములకు సం
బంధించి మరింత ఖచ్చితమైన భోగట్టా సేకరణకు ఉపగ్రహ సర్వే సదు
పాయాలను ఇప్పుడు వాడుకకు తేవ
డం జరుగుతోంది. ఈ సర్వేలనుబట్టి పదిశాతం వృక్షసాంద్రతగల అటవీ ప్రాంతం 1975లో 55.18 మిలి
యన్ హెక్టేర్లు ఉండగా, 1982 నాటికి 46.08 మిలియన్ హెక్టేర్లకు క్షీణించినట్టు తేలింది. అంటే ఏటా ఒకటిన్నర మిలియన్ హెక్టేర్ల అడవులను మనం కోల్పోతున్నామన్న మాట.

## మత్తు మందు

అమెరికాకు, పశ్చిమ యూరపుకు పాకిస్తాన్ పెద్ద యెత్తున మత్తు పదార్థాలను సరఫరా చేస్తున్నది. న్యూయార్కులో మత్తుమందులను అమ్ముతున్న నలుగురు పాకిస్తానీయులు యిటీవల అరెస్టు కావడంలో అబ్బురమేమీ లేదు. వీరిలో ఒకరు పాకిస్తాన్‌లోని వాయువ్య సరిహద్దు రాష్ట్ర గవర్నర్ అయిన అబ్దుల్ గఫూర్‌ఖాన్ హెూతి కుమారుడు గావడమే కొంత విశేషం. పాక్ ప్రభుత్వ మందలి ఉన్నతాధికారులు ఈ మత్తు మందుల వ్యాపారం, దొంగచాటు రవాణాలలో భాగస్వాములుగా నున్నారని ఒకాయన 'ముస్లిం' పత్రిక కిచ్చిన యింటర్వ్యూలో చెప్పారు. పేరు పేరునా వెల్లడించగలనని కూడా ఆయన

చెప్పారు. ముడి నల్లమందు, లేక హషీష్‌గా పిలవబడే పదార్థానికి ఉత్పత్తి దారుకు కిలోగ్రాము ఒకటి 50-70 డాలర్లు మాత్రమే ముడుతున్నది. దానిని శుద్ధిచేసి, తిరిగి అమ్మినప్పుడల్లా దాని ధర విపరీతంగా పెరిగిపోతున్నది. ఇలా చేతులు మారి న్యూయార్కు వీధుల్లో కిలోగ్రాము హషీష్ 2 లక్షల డాలర్ల దాకా అమ్ముడు పోతున్నది. ఇంతటి చుక్కలంటే లాభాలను జేబులో వేసుకుందుకై అన్ని స్థాయిలకు చెందిన నేరస్త మూకలు ఎంతటి ఘోరమయిన అత్యాచారాలకైనా నిర్దాక్షిణ్యంగా పాల్పడుతున్నాయి. . ....

....'వాషింగ్టన్ పోస్ట్' కథనానుసారం అమెరికాలో వాడకమవుతున్న హెరాయిన్‌లో సగానికి సగం పాకిస్తాన్ నుండే వస్తున్నది. చట్ట విరుద్ధమయిన యీ అమ్మకాల ద్వారా ఏటా 11,000 కోట్ల డాలర్ల లాభం వస్తున్నది. స్థానికంగా లభ్యమయ్యే హషేష్ నుండి హెరాయిన్‌ను ఉత్పత్తి గావించి, రవాణా చేసే ఒక అజ్ఞాత బృందం పాకిస్తాన్‌లో ఏర్పాటయింది. ఈ బృందంలో పాకిస్తాన్ పాలకవర్గ ప్రతినిధులు, ఆఫ్ఘన్ విప్లవ ప్రతీఘాతమూకల నాయకులు వున్నారు. ఖైబర్ కనుమ చుట్టుపట్ల గల ప్రాంతంలో నల్లమందు మొక్కల పెంపకం అనాదిగా సాగుతున్నది. ఆఫ్ఘన్ విప్లవానంతరం యిట్టి తోటల పెంపకం గణనీయంగా పెరిగింది. ఆఫ్ఘనిస్తాన్ నుండి పారిపోయి వచ్చి, యీ ప్రాంతంలో తిష్టవేసిన విప్లవ ప్రతిఘాతకులు రహస్యదళాలను ఏర్పాటు

## సినీ చిత్ర పోటీ

1986 మే నెల. ఆ బొమ్మలోని వారు మోహన్‌బాబు, భానుప్రియ అని అందరూ పోల్చుకోగలిగారు గాని చిత్రం పేరు చెప్పడంలో ఈ తీర్పు ఇల్లాలిది, గృహలక్ష్మి, ఆలాపన, మరో మొనగాడు – అన్నారు. 'ఇల్లాలికో పరీక్ష' అని కరెక్టుగా చెప్పగలిగిన 42 శాతంలోను బహుమతి పొందిన వారు: ఎ. నీరజ, కేరాఫ్: ఎ. బాలగంగాధరరావు, ఎ–34, షిప్‌యార్డ్ కాలనీ, గాంధీగ్రామ్, విశాఖపట్నం — 5.... ఎమ్మెస్. వెంకటేశ్వరరావు, అజంతా ఫైనాన్స్ కార్పొరేషన్, మెయిన్ రోడ్, తాడేపల్లిగూడెం - 534101 ... మొదటి పదహారు: 1 డి శ్రీనివాసరావు, రేపల్లె 2 కె విల్సన్, తిరువూరు 3 పి స్టాలిన్, విస్సన్నపేట 4 ఎమ్ శ్రావణకుమార్, కోవూరు 5 ఆర్ జయలక్ష్మి, ఏలూరు 6 ఎమ్ అయూబ్‌ఖాన్ మిర్యాలగూడ 7 సి విజయకుమార్, హైదరాబాదు 8 ఎల్ కాదంబరి, కర్నూలు 9 యస్ విజయ గోపాల్, చిత్తూరు 10 బి లక్ష్మిదాసు, మర్రిపాలెం 11 ఇ హరిబాబు, పాకాల 12 యమ్ శ్రీనివాసరెడ్డి, నర్సారావుపేట 13 డి నాగేశ్వరరావు, పిడుగురాళ్ల 14 యస్ శ్రీనివాసరావు, నెల్లూరు 15 జి కోటీశ్వరరావు, వెంకటగిరి 16 కె ప్రతాపరెడ్డి, మదనపల్లి. విజేతలందరికి అభినందనలు.



చేసి, వాటిద్వారా నల్లమందు అమ్మ కాలను విస్తృతంగా నిర్వహిస్తున్నారు. పశ్చిమ యూరపు, ఉత్తర అమెరికాలలో అమ్మకాని కుద్దేశించిన మత్తుమందులలో ఎక్కువ భాగం పాకిస్తాన్‌లోనే తయారవుతున్నాయని వియన్నాలో గల అంతర్జాతీయ మత్తు మందుల కంట్రోల్ బోర్డ్ వార్షిక నివేదిక పేర్కొన్నది.

## కొచ్చిన్

భారతనౌకదళసంస్థకొరకై, కొచ్చిన్ నౌకాదళ నిర్మాణసంస్థ వారు, చమురు టాంకులను త్వరలో తయారు చేయనున్నారు. ఒకొక్క టాంకరు 86,000 డి డబ్ల్యు టి వుంటుంది. మొట్టమొదటి సారిగా భారతదేశంలో, చమురు టాంకులను తయారుచేయటం ఘనంగా చెప్పతగ్గది. కొచ్చిన్ నౌకాదళసంస్థ ఇదివరలోనే పనామాక్స్ చమురుటాంకును గత ఫిబ్రవరిలో రవాణా చేసింది. నౌకలను రిపేరు చేయడంలో కూడా. ఈ సంస్థ బాగా పేరుపొందింది. ఈ పనామాక్స్ బల్క్ కారియర్ వల్లరు 5. 5. కోట్లు లాభాన్ని గణించాలనే లక్ష్యాన్ని పెట్టుకొన్నప్పటికి, ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో, రు. 6. 5 కోట్ల ఆదాయాన్ని దాటింది.

## విక్రమ్ సేథ్

కలకత్తాలో జన్మించిన ఒక భారతీయుడు రాసిన ఆంగ్లనవల యిటీవల అమెరికాలో గొప్పగా విజయవంతమైంది. విక్రమ్ సేథ్ అనే 34 ఏళ్ల ఈ యువ రచయిత శాన్ ఫ్రాన్సిస్కో నేపథ్యంతో రాసిన 'స్వర్ణద్వారం' ది) గోల్డెన్ గేట్) అనే ఈ తొలి నవల అత్యంత వాస్తవికంగా, హృదయ రంజకంగా వున్నదని 'న్యూస్‌వీక్' పత్రిక ప్రశంసించింది. స్వర్ణద్వారం నవలకు ఒక వైవిధ్యాన్ని సంతరింపజేసిన అంశం– అది పూర్తిగా పద్యరూపంలో వుండడం. ఈ నవలలోని అంకితం, విషయసూచిక, స్వీయ కథ విభాగాలు కూడా పద్యరూపంలోనే (14 లైన్ల 'సానెట్') వున్నాయి. ఈ 307 పుటల పుస్తకాన్ని ఇటీవల 'రాండమ్ హౌస్' ప్రచురించింది. 'స్వర్ణద్వారం' నవలలోని కథ జాన్ అనే ఒక ఇంజనీర్, అతని మాజీ ప్రియురాలు జీన్, కొత్త ప్రేయసి లిజ్ దొరాతి (స్టాన్ఫర్డ్ 'లా' గ్రాడ్యుయట్) ల చుట్టూ తిరుగుతుంది. జాన్, లిజ్‌ను కలుసుకున్న తర్వాత ప్రేమాయణం, పునర్విలీనంటివి ఒకదాని వెంబడి ఒకటిగా జరుగుదాయి. ఈరసవత్తరమైన సంఘటనల చిత్రణ గద్యరచనలో ఇంతటి హృద్యంగా వుండకపోవచ్చు. పద్యపాదాలలో అవి నిరంతరాయమైన ఆహ్లాదాన్ని కలిగించాయి అని 'న్యూస్ వీక్'లో ఈనవలను సమీక్షించిన విమర్శకుడు డేవిడ్ లీమన్ పేర్కొన్నారు. ఆక్స్‌ఫర్డ్‌లో విద్యనభ్యసించిన నవలా రచయిత విక్రమ్ సేథ్ ఒక టిబెటన్ యాత్రా గ్రంథాన్ని కూడా రచించారు. ఆయన ఇప్పుడు కాలిఫోర్నియాలోని స్టాన్‌ఫర్డ్ యూనివర్శిటీలో డాక్టరేట్ కోసం, చైనా ఆర్థిక గణాంక విషయాల పై, అధ్యయనం జరుపుతున్నారు.

# డైరీ

## 1986 మే 10

ప్రఖ్యాత దర్శకులు విశ్వనాథ్ వద్ద శిక్షణ పొందిన గీతాకృష్ణ, డాక్టర్ గంగయ్య నిర్మాతగా యమ్వీ ప్రసాద్ సమర్పణలో కోణార్క్ మూవీ క్రియేషన్స్ తరపున నాగార్జున, శరత్‌బాబు, సోమయాజులు, రాళ్లపల్లి, సాక్షి రంగారావు, కోట శ్రీనివాసరావు మున్నగువారు పాల్గొంటున్న 'సంకీర్తన' రూపొందిస్తున్నారు. ఇళయరాజా సంగీతం, వేటూరి సుందర్రామ్మూర్తి సీతారామశాస్త్రీల కవితా సృష్టి, పామ్‌గ్రోవ్ 'ఊర్వశి'లో విశ్వనాథ్, ఏడిద నాగేశ్వర్రావు గీతాకృష్ణకు, ఈ నూతన నిర్మాతలకు శుభాకాంక్షలు తెలిపారు.

## .....మే 11

ప్రఖ్యాత ఫిలిమ్ నిర్మాత డివియస్ రాజు కుమారుడు చి॥ డివికె రాజుకి, రాజమండ్రి వాస్తవ్యులు కెవి సత్యనారాయణ రాజు కుమార్తె సౌ॥ శోభకు ఈ ఉదయం 10 గం॥ 34 ని॥ లకు విజయరాణీ మహల్‌లో వైభవంగా వివాహం జరిగింది. ముహూర్తమయాక లంచ్. మద్రాసు, హైదరాబాదు చిత్ర పరిశ్రమకు చెందిన ముఖ్యులు, యితర పెద్దలు నూతన వధూవరులకు శుభాశీస్సులు తెలిపారు. డివియస్ రాజుగారు అందరికీ స్నేహపాత్రులు; ఫిలిం పరిశ్రమ లోతుపాతులు తెలిసిన నిండైన వ్యక్తి .... "ముప్ఫయ్యేళ్లు మద్రాసులో వుండి, పొట్టి శ్రీరాములు స్మారక భవనాన్ని నేనింత దాకా దర్శించలేకపోవటం నా దురదృష్టం. తరతరాల ప్రజలను ఉత్తేజితులు చేయగల ఘన త్యాగం ఆ మహాపురుషునిది. .... ఆ ధ్యానమందిరం, ఆపెరడూ, పెరటిలో వేపచెట్టూ యివన్నీ నన్నేవో అనిర్వచనీయ స్మృతులలో ముంచెత్తుతున్నాయి.... మీరు ఏం చేయదలుచుకున్నారో, మీకు ఏంకావాలో ఒక స్పష్టమైన కార్యక్రమావళితో నాకు అందజేయండి. ఒకఆశయంతో, ఒక ధ్యేయంతో మీరందరూ చేస్తున్న సేవలో, ఆ సేవానిరతిలో, రాష్ట్ర ప్రభుత్వ మందించే ఆర్థిక సహాయమేపాటి? మంచి పనులెప్పుడూ మంచి మనసులు చేసే ఏకోన్ముఖ కృషి వల్ల నెరవేరుతున్నాయి. ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వ సహాయం మీకెప్పుడూ వుంటుంది," – అన్నారు ముఖ్యమంత్రి యన్‌టి రామారావు, పొట్టి శ్రీరాములు స్మారక భవనంలో, సాయంత్రం నాలుగు గంటలకి ఏర్పరిచిన సమావేశంలో. పద్మభూషణ్ మోటూరి సత్యనారాయణ స్వాగతం తెలిపారు; బియస్సార్ కృష్ణ వందన సమర్పణ చేశారు. విద్యావంతులు, మేధావులు, అనదగు పాతిక ముప్ఫయి

మంది వున్న ఈ సమావేశంలో, నాలుగైదు సార్లు యన్‌టిఆర్ మాటలకు కరతాళధ్వనులతో ఆ చిన్న హాలు ప్రతిధ్వనించిందీ అంటే, సామాన్యులపై ఆయనకు గల సమ్మోహనశక్తి అర్థం చేసుకోవచ్చు. ఆయన కంఠంలోని ఆవేదనకీ, ఆర్ద్రతకీ, తనకు చేతనైనంతలో ఈ ప్రజలకేదో చేయాలనే తపనకీ, ప్రతి స్పందనతో చలించని గుండె వుండదు. ఆయన మాట్లాడేది కంఠంతో కాదు, హృదయంతో, - గొంతులో కొట్లాడే గుండెతో! రాజకీయారణ్యంలో ప్రవేశించిన హృదయవాది కారణజన్ముడైన యన్‌టిఆర్. .... సమావేశం ముగిసి, వస్తూండగా పొట్టి శ్రీరాములు సొసైటీ కార్యవర్గ సభ్యులైన ఆడిటర్ నందగోపాల్, మాలతీ చందూర్‌ని ముఖ్యమంత్రికి పరిచయం చేశారు 'ఆడ పడుచుల కేమివ్వగలం?' అంటూ తనకు వేసిన పూలమాల ఆమె చేతుల్లో వుంచగా, ఆనంద బాష్పాలు నిలిచాయి ఆమె కళ్లలో, - అనుకోని ఆ అపూర్వ సత్కారానికి! .... కళాసాగర్ వారి పన్నెండవ ఫిలిమ్ యవార్డ్స్, పధ్నాలుగో వార్షికోత్సవం మ్యూజిక్ అకాడమీలో! ముఖ్య అతిథి అవుల సాంబశివరావు. గత ఏడెనిమిదేళ్లగా తెలుగు చిత్ర కథాకథనంలో, వ్యక్తి సమస్యలుగాక సమాజ స్వరూపాన్ని ప్రతిబింబించే ప్రయత్నం, ప్రస్ఫుటంగా కనిపిస్తోందన్నారు. 'తెలుగుదేశం' ప్రభుత్వం చిత్రపరిశ్రమకు ఏవిధంగానూ తోడ్పడటం లేదన్నారు ప్రత్యేక అతిథి రామోజీరావు. బహుమతి గ్రహీతలను పేరు పేరునా తన సహజ వాక్చాతురితో అభినందించారు దాసరి నారాయణరావు. కళాసాగర్ అధ్యక్షులు యమ్మెస్ రెడ్డి స్వాగతం తెలిపారు; సినీసుందరి సుమలత అవార్డీలను వేదికమీదకు ఆహ్వానించారు. "ఈసంవత్సరం పదిహేడు అవార్డులలో పదకొండు 'ప్రతిఘటన' బృందానికి వెళ్లాయి; 'మేఘసందేశం' ఈగౌరవం అందుకుంటున్నప్పుడు కూడా సరిగ్గా అదే సంఖ్య. ఈసందర్భంగా కళాసాగర్ సభ్యులని, న్యాయ నిర్ణేతలని వారి ఉచితజ్ఞతకు, రసదృష్టికి అభినందించక తప్పదు, ప్రజామోగంగల కళాసాగర్ అవార్డ్ ఎంతో ప్రతిష్ఠాకరం"-అన్నారు దాసరి.

1 ఉత్తమచిత్రం – ప్రతిఘటన; .... 2 ఉత్తమదర్శకులు- టి కృష్ణ (ప్రతిఘటన; 3 ఉత్తమ నిర్మాత- రామోజీరావు (మయూరి); 4 ఉత్తమనటుడు – శోభన్‌బాబు (దేవాలయం); 5 ప్రత్యేక ప్రశంస - మురళీమోహన్ (ఓ తండ్రి తీర్పు); 6 ఉత్తమనటి–విజయశాంతి (ప్రతిఘటన); 7 ప్రత్యేక ప్రశంస – సుధాచంద్రన్ (మయూరి) 8 ఉత్తమ సహాయనటుడు - సుత్తివేలు (ప్రతిఘటన); 9 ఉత్తమ సహాయనటి - శారద (పల్నాటిసింహం); 10 ఉత్తమ హాస్యనటుడు -కోట శ్రీనివాసరావు (ప్రతిఘటన); 11 ఉత్తమ హాస్యనటి - రమాప్రభ (ముచ్చటగా ముగ్గురు); 12 ఉ_మ కథారచయిత- కామేశ్వరరావు (వందేమాతరం); 13 ఉత్తమ సంభాషణా రచయిత - హార

నాధరావు (ప్రతిఘటన); 14 ఉత్తమ నేపథ్యగాయకుడు- బాలసుబ్రహ్మణ్యం (కీరవాణి - 'అన్వేషణ'లో); 15 ఉత్తమ నేపథ్యగాయని సుశీల (ఈ కుంకుమతో - 'పల్నాటి సింహం' లో); 16 ఉత్తమ సంగీత దర్శకులు- బాలసుబ్రమణ్యం (మయూరి); 17 ఉత్తమ ఛాయాగ్రాహకుడు - రఘు (అన్వేషణ) .... సూచించిన చిత్రం పేరు మరొకటైనా 'ప్రతిఘటన'కు చెందిన పదకొండుగురు 'కళాసాగర్' అవార్డులు అందుకున్నారు. చక్కగా జరిగిన ఫంక్షన్‌లో ఒకటి రెండు అప శృతులు లేకపోలేదు. నృత్య విభావరి పేరుతో ప్రదర్శించిన అయిదుగురు యువకుల పాశ్చాత్య నాట్యానికి ఇది సముచితమైన వేదిక కాదు; అలాగే 'వినోద విభావరి'లో మాటలు సరిగా వినబడలేదు– ప్రదర్శన రక్తికట్టలేదు. కోట శ్రీనివాసరావు మాత్రం సభికులని తన కబుర్లతో జోక్స్‌తో ఆనందింప జేశారు.... కళాసాగర్ పద్నాలుగో వార్షికోత్సవం రంగు రంగుల దీప తోరణాలతో వెండి తెర వెదజల్లే వెలుగులతో ఎంతో రమ్యంగా రసభరితంగా సాగింది.

. . . . 12

కౌముదీ పిలింస్ యమ్మెస్ రెడ్డి కుమారుడు శ్యామ్‌ప్రసాద్‌రెడ్డి, యమ్మెస్ ఆర్ట్ మూవీస్ పేరిట నిర్మిస్తున్న చిత్రానికి ఈ ఉదయం జెమినీరికార్డింగ్ థియేటరులో ప్రారంభోత్సవం. ఈచిత్రానికి మాటలు గణేష్‌పాత్రొ, పాటలు మల్లెమాల, దర్శకత్వం కోడి రామకృష్ణ; సంగీతం: సత్యం. కళ్యాణ చక్రవర్తి, రాజశేఖర్ తెలుగు ప్రేక్షకులకు కొత్త హీరోయిన్ జీవిత, ఈ చిత్రంలో నటిస్తున్నారు. యమ్మెస్ రెడ్డి పాత్రికేయులకి ఈ చిత్ర విశేషాలు తెలిపారు.

. . . . . 13

1979 లో అన్నామలై యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్‌గా నియమితులై, అక్కడి అలజడినీ ఆందోళనని సమర్ధవంతంగా రూపుమాపి, ఆ విశ్వవిద్యాలయానికి వెనకటి పేరు ప్రతిష్ఠలు తెచ్చిపెట్టిన ప్రొఫెసర్ చిట్టిబాబు, అసోసియేషన్ ఆఫ్ ఇండియన్ యూనివర్సిటీస్‌కి అధ్యక్షులుగా ఎన్నికైన సందర్భంగా మైలాపూర్ అకాడమీ వారు వుడ్‌లాండ్స్‌లో అభినందన సభ ఏర్పాటు చేశారు. సిటిజన్స్ కమిటీ ఛైయిర్‌మాన్ వైద్యసుబ్రహ్మణ్యయ్యర్ స్వాగతం తెలిపిన మీదట, 1947 లో మద్రాసు ఎడ్యుకేషనల్ సర్వీసులో ప్రవేశించిన చిట్టిబాబు, ప్రెసిడెన్సీ కాలేజీ, కోయంబత్తూరు వెల్లూరు కాలేజీలలో ప్రొఫెసరుగా పని చేయడం ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా డిప్యూటీ డైరక్టరుగా, డైరక్టరుగా, మధురై కామరాజ్ యూనివర్సిటిలో వైస్ ఛాన్సలర్‌గా, విద్యారంగంలో చేసిన కృషినీ వ్యక్తిగా ఆయన విశిష్టతనీ తెలిపారు. సభాధ్యక్షత వహించిన జస్టిస్‌మోహన్, చిట్టిబాబు పురోభివృద్ధిని ప్రశంసిస్తూ, అమెరికా, ఇంగ్లండు, ఫ్రాన్సు, పశ్చిమ జర్మనీ, హాలాండ్, – తాయిలాండ్ యిలా అనేక లాండ్స్ పర్యటించి వచ్చిన ఈ విద్యావేత్త, ఒకసారి అంటూ

ర్సిటికా వెళ్లివచ్చినా ఆశ్చర్య పోనక్క ర్లేదు అన్నారు తమిళనాడు ఆర్థికమంత్రి నెడుంజెలియన్. అన్నామలై యూని వర్సిటీ ప్రో – ఛాన్సలర్ యమ్‌స్‌యమ్ రామస్వామి, వుమెన్స్ ఇండియన్ అసో సియేషన్ అధ్యక్షురాలు సరోజినీ వర దప్పన్, పాండుచ్చేరి కేంద్రవిశ్వవిద్యా లయ ఉపాధ్యక్షులు వెంకట సుబ్ర మణియమ్, మైసూరు యూనివర్సిటీ మాజీ వైస్ ఛాన్సలర్ హెగ్డె, ప్రొఫెసర్ చిట్టిబాబు విద్యాసంపత్తి కార్యదక్షతల గురించి ప్రసంగించారు. దేశంలోని 150 విశ్వవిద్యాలయాలు, ఒక దాక్షి ణాత్య ప్రొఫెసర్‌ని, ఈ ఉన్నత పదవికి ఎన్నుకోవడమంటే ఆయన ఎంతటి ప్రతిభావంతుడో ఊహించు కోవచ్చు. మద్రాసులో వేణుగోపాల చెట్టియార్ అనే సామాన్యమైన అడ్వ కేటుకి జన్మించిన చిట్టిబాబు, స్వయం కృషితో, ఉత్తమ ఆశయాలు ఉన్నత లక్ష్యాలతో భారతీయ విద్యారంగం లో శిఖరమనదగు ఈస్థానం అందుకో గలిగారు. నూట ఏభై విశ్వవిద్యా లయాల సమాఖ్యకు అధ్యక్షులయారు. "అన్ని ఉద్యోగాలలోకి అతి క్లిష్టమైనది ఈ వైస్ ఛాన్సలర్ ఉద్యోగం. - ఇది ముళ్లకుర్చీయే గాని, మెత్తటి కుర్చీ కాదు. కాని, నాపై ఆ బాధ్యత పడ్డ ప్పుడు, తప్పించుకోవడం గాక, దానినొక ఛాలెంజ్‌గా తీసుకు, ఎదుర్కో వటమే నా కర్తవ్యమనిపించింది.... అన్నామలై యూనివర్సిటీ చిక్కుల్లో వున్నప్పుడే నేను అక్కడికి వెళ్లాను. ఆ చిక్కుముడులు విప్పలేక పోతానా అనే ధైర్యంతో వెళ్లాను. స్వర్గీయ ముత్తయ్ చెట్టియార్, వారి కుమారులు రామస్వామి, నాతో పని చేస్తున్న ప్రొఫెసర్లు, విద్యార్థులు అందరి సహ కారంతో నేను అక్కడి పరిస్థితులు చక్కదిద్ద గలిగాను. వివాదంలో వున్న 40 డిమాండ్లలో 25 విషయంలో అంగీకారం కుదరడంతో, ఉద్రిక్తత తగ్గింది. నెమ్మదిగా అన్నీ ఒక దారికి వచ్చాయి. నా ఉన్నతికి కారకులు మాజీ ముఖ్యమంత్రి భక్తవత్సలం; పక్కనే ఆశీనులై వున్న ఆర్థిక మంత్రి నెడుంజెలియన్ .... ఇంటర్ యూని వర్సిటీ బోర్డు అనేది 1925 మార్చి 23న. జనించింది. అధ్యాపకుల పరిస్థితి, పరీక్షా ప్రమాణాలు, డిగ్రీల అమ్మకాన్ని నిరోధించడం యిలా పది అంశాలపై సుదీర్ఘచర్చలు జరిపారు. 1925 నాటికే 'డిగ్రీల అమ్మకం వ్యాధి' మన దేశానికి కూడా సోకింది. ఆ ఇంటర్ యూనివర్సిటీ బోర్డు కాలక్రమేణా అసో సియేషన్ ఆఫ్ వైస్ ఛాన్సలర్స్‌గా రూపు తీసుకుంది ....ఒక్క బీహారు రాష్ట్రంలో తొమ్మండుగురు వైస్ ఛాన్సలర్స్ పదవీ చ్యుతులయారంటే, యిది ఎటువంటి కత్తిమీద సామో ఆలోచించండి .... స్వయం ప్రతిపత్తితోనే విశ్వ విద్యాలయాలు రాణించ గలుగు తాయి.... విద్యారంగాన్ని కాలావసరా లకు అనుగుణంగా రూపొందించేందుకు 'హ్యూమన్ రిసోర్సెస్ డెవలప్ మెంటు' మంత్రిత్వశాఖ తగు పథకాలు తయారు చేస్తున్నది" — అన్నారు ప్రొఫెసరు చిట్టిబాబు తన సమాధానం

లో. యన్ని రాఘవాచారి వందన సమర్పణ చేశారు.

. . . . 14

చిరకాల మిత్రులు స్వర్గీయ జెవిబి జీవనరావు రెండవ కుమార్తె సౌ॥ ఇందిరా లావణ్యకు, ఆర్టిసాన్ అండ్ కంపెనీ పార్టనర్ పశుపతి కుమారుడు చి॥ చందర్‌కు, ఈ ఉదయం పదకొండు గంటలకి విజయా శేష్‌మహల్‌లో వివాహం జరిగింది. ఉదయం ముహూర్తానికీ, సాయంత్రం రిసెప్షన్‌కీ బంధు మిత్రులనేకులు వచ్చి నూతన వధూ వరులని ఆశీర్వదించారు.... సాయంత్రం అయిదున్నరకి 'దేవి శ్రీదేవి'లో 'దేవీపూజ' పాటల ప్రొజెక్షన్.... మయూరి సుధ నటిస్తున్న ఈ చిత్రానికి మాటలు, పాటలు: గోపి. నిర్మాత: వెంకట్రావు; దర్శకత్వం: సోమసుందర్. నటుడు లక్ష్మీకాంత్ సమర్పిస్తున్న చిత్రమిది.... 'అడిగినవారికి వరముల నొసగే తల్లివట – నిన్ను నమ్మినవారికి సిగలో పూవై వుందువట'.... 'శ్రీరాజ రాజేశ్వరీ – దేవీ - సౌందర్య రత్నాకరీ' – ఈ మాదిరి అయిదు పాటలూ భక్తిరస ప్రధానమైనవి – గాయనీ గాయకులు: సుశీల, బాలు.

. . . . 15

"1921లో అహమ్మదాబాద్ కాంగ్రెస్‌నుంచి తిరిగివచ్చిన ముగ్గురు యువకులు, బొంబయిలో దిగబడిపోయారు – స్ట్రాండెడ్. ఆ ముగ్గురూ ఎవరంటే, కర్దార్, జస్వంతలాల్, మూడో ఆయన మా ఫాదర్, సి పుల్లయ్యగారు. వీరు ముగ్గురూ 'మరాఠీ లాబ్స్'లో నెలకు అయిదురూపాయల జీతం మీద పనిచేసేవారు.... జస్వంతలాల్ బ్రహ్మాండమైన మైథలాజికల్ పిక్చర్స్ తీశాడు.... ఆ జస్వంతలాల్‌ని నేను ఈ 'కచదేవయాని' లో అనుకరించబోతున్నాను... మా నాన్నగారు తీసిన రామాయణం 'లవ కుశ' ల యాంగిల్ నుంచి. అదే గాథని అనేక 'యాంగిల్స్' నుంచి తీయవచ్చు... 'కచదేవయాని' కథని శుక్రాచార్యుని దృక్పథం నుంచి చూపిస్తున్నాను," అన్నారు దర్శకులు సియస్ రావు. ఈ సాయంత్రం ప్రసాద్ స్టుడియోస్‌లో జరిగిన పత్రికా సమావేశంలో.... 'పురుషుడు బహువ్యావృతుడు; స్త్రీ ఏకధ్యేయదురంధురాలు, అనే ప్రాచీన సత్యాన్ని చంద్రోదయావారి ఈ చిత్రం చూబుతుంది. సత్యనారాయణ, కోట శ్రీనివాసరావు, చక్రపాణి, గిరిబాబు, పిజె శర్మ, ద్వారకానాథ్, జీవా, ప్రభ, విజయరంజని, శ్రీజయ, ప్రమీలా జోషాయ్, సంధ్య, లక్ష్మీ చిత్ర యిందులో నటిస్తున్నారు. నిర్మాతలు: పరంధామరెడ్డి, జగ్గుబాబు. మాటలు: కొండవీటి వెంకటకవి; పాటలు: కొసరాజు, సీతారామ శాస్త్రి. సంగీతం: మహదేవన్. నిర్మాణత: కెవి ఆర్ మూర్తి.

. . . . 16

అమెరికనులకి విశిష్టతకోసం పాటుబడటం సరదా. ఆ విశిష్టత ఎంతకీ వస్తూత్పత్తి, విక్రయం విషయంలోనే

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చినజాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం ఏదిమార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 30 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 - 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 7 – 50 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

రు 20/- పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు, ముందుగా ఆ పుస్తకాల ధరకు 2 రూ॥ తగ్గించి M.O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.



క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి - విజయవాడ-2

అధికంగా కనిపిస్తుంది. పేపర్లు అమ్మే కుర్రవాడు ప్రెసిడెంట్ కాగల గట మైనా, ఇరవయ్యోయేట బిజినెస్ (మాకిన్ టోష్ పెర్సనల్ కంప్యూటర్) ప్రారం భించి, 28వ ఏట కోటాను కోట్లకు అధిపతి కాగలగటమైనా అక్కడే సాధ్యం. ఆధునిక సమాజానికి పరిశ్ర మలు అవసరం. పరిశ్రమలు సవ్యంగా సాగేందుకు, వస్తూత్పత్తి సక్రమంగా జరిగేందుకు యాజమాన్యానికీ పని వారికీ మధ్య పరస్పర అవగాహన వుండాలి. వర్కర్స్ పార్టిసిపేషన్, వర్కర్స్ ఇన్‌వాల్వ్‌మెంటు, ఇవి పరిశ్ర మల అభివృద్ధికి మూలస్థంభాలు అం టారు. అమెరికన్ సెంటర్లో ఆహూతు లకు చూపించిన 'ఇన్ సెర్చ్ ఆఫ్ ఎక్స లెన్స్' (In Search of Excellence) వారి దేశంలోని వివిధ పారిశ్రామిక వేత్తల అభిప్రాయాలు తెలుపుతోంది.

. . . . 17

"జ్యోతిర్మయిని నేను ఎరుగుదును. చాలా నెమ్మదస్తురాలు. కాని, వుండి వుండి మెత్తగా పలికే మాట మా అం దరినీ నవ్వించేది. అటువంటి కవితా హృదయినిని యింత చిన్న వయసులో పోగొట్టుకున్న కొంపెల్ల విశ్వం దుర దృష్ట వంతులు," అన్నారు జ్యోతిర్మయి అవార్డు సభకు (పామ్‌గ్రోవ్‌లో) అధ్యక్షు రాలుగా విచ్చేసిన కె రామలక్ష్మి. "కవి తకు, నాటకానికి, నవలకు, కథలకు అంటూ ఒకొక్క విభాగంలో నిష్ణాతులుగా ఎన్నికైనవారికి ఈ అవార్డ్ అందజేయడం చాలా బావుంది. కవితకు ఎక్కడ పట్టా భిషేకం జరిగినా, నేనా సభలో వుండటం ఆనవాయితీ అయిపోయింది. అవార్ ఈ నాడు అందుకుంటున్న ఆచార్య తిరుమల నాకు చాలాకాలంగా తెలిసిన మిత్రులు" - అన్నారు ముఖ్య అతిధి యమ్మేస్ రెడ్డి ... "143 ఎంట్రీలలో, ఆ పోటీలో, 'అక్షరాగ్ని' బహుమతి నందుకోగలగడం నాకెంతో సంతో షంగా వుంది"— అన్నారు శాలువా చెయ్యెన్నూటపదహార్లు అందుకొన్న ఆచార్య తిరుమల. జగదీష్‌బాబు స్వాగత వచనంతో సభను ప్రారంభించి, చివర్ని వందన సమర్పణ గావించారు. ('కొత్త పుస్తకాలు' శీర్షికలో, 'అక్ష రాగ్ని' సమీక్ష 'జగతి -357'లో వెలువడింది)

. . . . . 24

"'కోటిగాడు' అనే టైటిల్ కొంచెం కటువుగా వున్నా, యిది ఎంతో రసవ త్తరమైన చిత్రం. – ప్రివ్యూ చూశాక మీకే తెలుస్తుంది. ఈ పిక్చర్లో అయిదు విభిన్న పాత్రలు వున్నాయి. యాకన్ హీరో అర్జున్‌ది యిందులో రసప్రపూర్ణ మగు పాత్ర, అలాగే శరత్‌బాబు పాత్రలో సహజ నాయకత్వం కని పిస్తుంది"- అన్నారు దర్శకులు, పామ్ గ్రోవ్ పత్రికా సమావేశంలో. పబ్లిక్ రిలేషన్స్: అర్జునరావు .... 'అన్న మయ్య' రికార్డింగ్. శాండిల్య పంపిన ఆహ్వానం, యివ్వాళ ఉదయం పోస్టులో అందడం [నిన్న పోస్టల్ హాలీడే బుద్ధపౌర్ణమి అన్నమాచార్య (1408-1503) 578 వ జయం తి] వల్ల, వెళ్లలేకపోయాను. ....పామ్ గ్రోవ్ లోనే ఉన్నారు శాండిల్యా,

చారిత్రాత్మక నవలా చక్రవర్తి ముది గొండ శివప్రసాద్... వారితో ఒక గంట సేపు సినిమాలు, సాహిత్యమూ గురించి కాలక్షేపం. 'హరి అవతార మితడె అన్నమయ్య ....' కాసెట్ (నిన్నటి నాందీగీతం - సుశీల) ఇయర్ ఫోన్స్‌లో విన్నాను- మిగతావారి సంబా షణకు ఆటంకంలేకుండా! ఆ గానసుధ వింటూంటే ఆరు శతాబ్దులనాటి ఊహా చిత్రం, మధుర భక్తి మనోహర చిత్రం, కనుల ముందు కదలాడింది. జంధ్యాల దర్శకత్వంలో, సీతా పద్మ రాజు, శాండిల్య నిర్మిస్తున్నారు 'అన్న మయ్య' చిత్రాన్ని — ముదిగొండ శివప్రసాద్ ఈ చిత్రకథకు రూపమిస్తు న్నారు. రమేష్ నాయుడు సంగీతం, గోపాల రెడ్డి కెమెరా .... 'శృతులై శాస్త్రములై పురాణ కథలు సుజ్ఞాన సారంబులై - యతిలోక గమ వీధులై వివిధ మంత్రార్థంబులు నీతులై - కృతులై వేంకట శైల వల్లభ రతిక్రీడా రహస్యంబులై - నుతులై తాళుల పాక అన్నయ వచోనూత్న క్రియల్ చెన్న గున్'....వెనకటిది నాట్యానంద భైరవి, ఇది మధుర ప్రేమానంద భైరవి కాగ లదని ఆశిస్తున్నాం.

. . . . 25

'బుజ్జాయి' 'టెర్రర్' పత్రికల అధి నేత గొర్రెపాటి అప్పారావు పెద్ద మ్మాయి సౌ॥ భవానీ వెంకట శేషకుమా రికి, రాజమండ్రీ వాస్తవ్యులు స్వర్గీయ దుంగల అప్పలస్వామి కుమారుడు చి॥ శ్రీనివాసరావుకు రాత్రి 10గం॥54ని॥ లకు, 100 హబిబుల్లారోడ్ కళ్యాణ మండపంలో వివాహం జరిగింది. పెళ్లికి ముందే విందుభోజనం. పత్రి కలవారూ, సినీరంగంలోని అనేకులూ నూతనదంపతులకు తమ శుభాశీస్సులు తెలిపారు. భోజనాలై కిందకొచ్చాక, రావి కొండలరావు దంపతులు కనిపిం చారు. "ఏప్రిల్ 'జగతి'లో పాతికేళ్లనాటి రేడియో నాటిక 'భమ్మాన్'లో కరు త్తమ్మ పాత్ర చాలా బాగా చేశార న్నారు. ఎవరు?" - అన్నారు రాధా కుమారి. నిజానికి పాతికేళ్లనాటి ఆసమీ క్షలో పేరు రాయనూ లేదు, గుర్తూ లేదు. "నేనే – అది నా రెండవ రేడియోనాటిక" అన్నారు రాధాకుమారి ఎంతో సంతోషంతో. పాత జ్ఞాపకాలు ఎంత పరిమళ భరితం!

. . . . . 28

ఉదయం జెమినీలో కౌముదీవారి 'ఓ ప్రేమకథ'కిముహూర్తం; 'ఎండలో నీడలా, నీడలో నిదురలా - వల పొచ్చి వాలింది నా గుండెలో, వరదలై పొంగింది నీ అండలో' (మల్లె మాల పాట – గాత్రం: బాలు, సుశీల; సంగీతం: రంగారావు) రికార్డింగ్. రాజశ్రీ దర్శకత్వం వహిస్తున్న ఈ చిత్రంలో సర్వదమన బెనర్జీ, రాధిక, జీవిత, సత్యనారాయణ, గొల్లపూడి, జయమాలిని, కృష్ణవేణి మున్నగువా రున్నారు. రావూరి భరద్వాజ కథకు మల్లెమాల మాటలు, పాటలు. నిర్మాత: యమ్మెస్ రెడ్డి. ఈ చిత్రంలోని ప్రతి పాటా ఒక రసగుళిక.... సాయింత్రం విజయాశేష్‌మహల్‌లో మాగుంట సుబ్బరామరెడ్డి దంపతుల కుమార్తె

సౌ॥ సుమాలినికీ, ప్రేమకుమార్‌రెడ్డీ దంపతుల (కడియం) కుమారుడు చి॥ శివకుమార్ రెడ్డికి వివాహ మహోత్సవం - అక్షరాలా మహోత్సవం. శుభలగ్నం 9గం॥ 50ని॥లకు. ఏడు గంటలనుంచి విందు భోజనాలు - సుశీల, బాలు, శైలజల సంగీత విభావరి. ప్రత్యేకంగా వేసిన పెళ్లిపందిరి బంధు మిత్ర సందోహంతో కిటకిటలాడింది. తమిళనాడు ముఖ్యమంత్రి యమ్‌జిఆర్ సతీసమేతంగా వచ్చి నూతన వధూవరులపై శుభాక్షితలు చల్లారు. అతి ధనవంతులైనప్పటికీ మంచితనానికి మారు పేరు సుబ్బరామ రెడ్డీదంపతులు - వారి అమ్మాయి సౌ॥ సుమాలిని; వరుడు చి॥ శివకుమార్‌రెడ్డి విజయాధినేత నాగిరెడ్డి మనుమడు; కూతురు కొడుకు. ఐశ్వర్యంతో బాటు రూపసంపద విద్యాసంపదగల ఈ నవదంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . . 29

'హో అండ్ కంపెనీ' ఎంబెరు మానార్ చెట్టి దంపతుల కుమారుడు చి॥ శ్రీధర్‌కి హెచ్చెస్ అద్వానీ దంపతుల కుమార్తె సౌ॥ ప్రియకు అబట్స్‌బరీలో ఈ ఉదయం వివాహ సుమూహర్తం. సాయంత్రం రిసెప్షన్. పట్నంలోని ప్రముఖులూ, వ్యాపారరంగంలోని ముఖ్యులూ కళాసీమలోని ప్రఖ్యాతులు, అనేకులు వచ్చి, నూతన వధూవరులకు తమ శుభాకాంక్షలు తెలిపారు.

. . . . 30

"కవి గురు రవీంద్రనాథ్ టాగూర్ 125వ జయంతిని ఒక సంవత్సరం పాటు నిర్వహించ దలుచుకున్నాం. పుస్తక ప్రదర్శన, రవీంద్ర మేళా, సెమినార్లు, హిందీ, ఇంగ్లీషు, బెంగాలీ, నేపాలీ భాషలలో ఆయన పుస్తకాలపునఃప్రచురణ జరుగుతుంది. విశ్వ కవికి మాతృ దేశం పైగల భక్తి, మానవాళిపై, మమతానురాగం, జగత్ప్రభువుగురించి ఆయన చేసిన గానం, జాతీయసమైక్యతకు, లోకశాంతికీ ఆయన గావించిననిర్విరామ కృషీ భారతీయు లందరికీ గుర్తు చేసే ప్రయత్నం మాది. రాష్ట్రం వెలుపల, మొదటిసారిగా మద్రాసులో ఈ జయంతి ఉత్సవం రెండు రోజులపాటు జరుపుతున్నాం. నిన్నటిరోజున మాజీ ఉత్తరప్రదేశ్ గవర్నర్ బెజవాడ గోపాల రెడ్డి అధ్యక్షత వహించగా తమిళనాడు విద్యా మంత్రి అరంగనాయగమ్ ప్రారంభోత్సవం చేశారు. అనునయ చటోపాధ్యాయ, కదిరేశన్ ప్రసంగింవారు: ఇవ్వాళ, నటరాజన్, అరసూ టాగూర్ గురించి చెబుతారు. .... ఢిల్లీ, త్రిపుర, ఒరిస్సాలలో రవీంద్ర జయంతి జరుగుతుంది. ఇంకా, చాలా పట్నాలలో ఈ జయంతి ఉత్సవాల ప్రయత్నాలు తలపెట్టాం" - అన్నారు కలైవాణర్‌లో పశ్చిమ బెంగాల్ ప్రభుత్వపు సమాచార శాఖాధికారి పికె భట్టాచార్య. శాంతినికేతన్‌లో వుండివచ్చిన ఒక తమిళ దంపతులు రవీంద్రగీతావళిని, తమిళంలో రవీంద్ర సంగీత బాణిలో పాడారు; సభికులు కరతాళ ధ్వనులతో తమ హర్షం వెలిబుచ్చారు.

. . . . 31

ఉత్సాహ వంతుడూ వైవిధ్య పాత్రలను (ఈ మధ్య 'నిరీక్షణ') విశిష్టవంతగా పోషించే నటుడూ అయిన భానుచందర్ పుట్టిన పండగ యివ్వాళ. సాయింత్రం నాలుగు నుంచీ జన్మదిన వేడుకలు జరుగుతున్నాయి. కాని, 'మద్రాసు బంద్' (శ్రీలంక తమిళులపట్ల సానుతాపంతో) అవడం వల్ల, ఆరు దాటాకగాని వెళ్ళడానికి వీలవలేదు. 'మెనీ హాపీ రిటర్న్స్' చెప్పి, టిఫిన్ తీసుకు, కాసేపు కబుర్లయాక, లేవబోతూండగా, పత్రికా మిత్రులకని ఉద్దేశించిన 'గిఫ్ట్ పాకెట్' ఒకటి చేతిలో పెట్టారు – సి - త్రు స్టెయిన్‌లెస్ స్టీలు కంటెయివర్. డైనింగ్ టేబుల్ మీదున్న 'సిరి వెన్నెల' వారి పాత్రకి జతగా యిది.... బాలు మహేంద్ర దర్శకత్వంలో భానుచందర్ నటించిన 'నిరీక్షణ' యింకా చూడలేదు. వారం పది రోజులలో లింగమూర్తిగారి (లక్ష్మీ ఫిలింస్) నడిగి కాపీ తెప్పించి చూపిస్తానన్నారు భాను.

## 1986 జూన్-1

సెన్సార్ బోర్డుమెంబర్ బాలా రావు - మెరైన్ ఇంజనీర్ ఐ యమ్ రావు దంపతుల కుమార్తె సౌ॥ సత్యకు, చి॥ ప్రదీప్‌కి ఈ ఉదయం 9 గం॥ 48 ని॥ లకు వేదోక్తంగా రాజేశ్వరీ కళ్యాణ మండపంలో వివాహం జరిగింది. సాయింత్రం రిసెప్షన్‌కి, వెంపటి

చినసత్యం కూచిపూడి ఆర్ట్ అకాడమీ వారి నాట్య ప్రదర్శన. రావూ దంపతులు ఆహూతులని ఎంతో ఆదరంతో రిసీవ్ చేసుకు, డిన్నరయాక గాని వెళ్లనివ్వలేదు. చూడ ముచ్చటగా వున్న నవదంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . జూన్ 2

1963లో మద్రాసు వచ్చి, కూచిపూడి నాట్యకళకు అంకితమైన వెంపటి చినసత్యం స్థాపించిన కూచిపూడి ఆర్ట్ అకాడమీ, యిన్నాళ్లకు యిన్నేళ్లకు, తనదీ అనుకోగల స్వంత భవనం, తమిళనాడు ప్రభుత్వపు ఔదార్యంవల్ల, ముఖ్యంగా యమ్‌జి రామచంద్రన్‌కి లలితకళలపట్లగల గౌరవాభిమానాల వల్ల సంపాదించుకోగలిగింది. మహానగరం మధ్యలో, గ్రవుండ్ రెండు మూడు లక్షలకు పైనుండే గ్రీన్‌వేస్ రోడ్‌లో, ప్రభుత్వ సంగీత కళాశాలకి ఎదురుగా, అయిదుగ్రవుండ్ల నేలని, గ్రవుండ్ కేవలం ఒక లక్ష చొప్పున, మంజూరు చేసింది రాష్ట్ర ప్రభుత్వం. ఒక మంచిపనికి ఉచితంగా యివ్వకూడదా అని కొందరికి సందేహం రావచ్చు. కాని, ఉత్తరోత్రా దానివల్ల అనేక సాధక బాధకాలు రావచ్చు. అంచేత, ప్రభుత్వం ఈ అయిదు గ్రవుండ్ల భూమిని కూచిపూడి ఆర్ట్ అకాడమీవారికి అయిదు లక్షలకు విక్రయించింది. తిరుపతి దేవస్థానం వారు లోగడ యిచ్చిన విరాళం, వెంపటి చినసత్యం తన నాట్యబృందంతో విదేశపర్యటనలు (ముఖ్యంగా అమెరికా) చేసినప్పుడు మిగిల్చిన పైకం, ఇతర దాతలు ఇచ్చినదీ యిదంతా కలిపి అయిదులక్షలూ చెల్లించి, కూచిపూడి ఆర్ట్ అకాడమీ ఈ భూమికి స్వంతదారు (వోనర్) అయింది. ఇక భవన నిర్మాణం.... ఈ ఉదయం 9గం॥ 15ని॥ కు తమిళనాడు ముఖ్యమంత్రి భవననిర్మాణ శంకుస్థాపన చేశారు; తన స్వంత విరాళంగా ఏ భైవేలు యిచ్చారు. ప్రముఖ

పారిశ్రామికవేత్త ఓబులరెడ్డి భవన నిర్మాణం గావిస్తున్నారు - ఆ భవనం పేరు ఓబులరెడ్డి భవన్. మరొకసారి శ్రామికవేత్త బివియస్సెస్ మణి డాన్స్ హాలు కట్టిస్తున్నారు. అలాగే కళాభిమాని గౌడ్, రాజాలక్ష్మి ఫౌండేషన్ రమణయ్యరాజా నిర్మాణ వ్యయంలో కొంత భరిస్తున్నారు. హేమాచౌదరి పదివేలు, ధనలక్ష్మి పదివేలు తమ విరాళంగా చెక్కులు అందజేశారు. సినీతార ప్రభ పదిహేనువేలు యిస్తున్నారు. సభకు రాలేకపోయిన కళ్యాణి పదివేలు యిస్తున్నారు. ఇలా ఎందరెందరో శిష్యులు మేస్టారి పట్ల తమ భక్తి గౌరవాలు వెల్లడి చేస్తున్నారు. ఈ భవన ప్రాంగణం ఎప్పుడూ పచ్చగా కలకల్లాడుతూ వుండేందుకు చెట్లూ మొక్కలూ గ్రీనరీ, పాత్‌వేస్, లాన్స్ ఆ వృక్షచ్ఛాయా సౌందర్య భారమంతా ఇంద్రసేనన్‌ది. ఈ నేలను చదును చేసేందుకు, అది గృహనిర్మాణానికి అనువుగా మార్చేందుకు రెండూ రెండున్నర లక్షలవుతుందట-చదునుచేయించి యిచ్చేభారం తమిళనాడు ప్రభుత్వం వహిస్తున్నది. 1986 మార్చి 3వ తేదీన ఈ స్థలం యివ్వనున్నట్లుగా ప్రభుత్వం వారు కూచిపూడి ఆర్ట్ అకాడమీకి తెలియజేశారు; అయిదు లక్షలూ చెల్లించి, రెజిస్ట్రేషన్ చేయించు కున్నారు. భవన నిర్మాణానికి జూన్ 2వ తేదీన, ఏ యమ్‌జి ఆర్ మద్రాసు మ్యూజిక్ అకాడమీలో 1982 ఆగస్టు 6వ తేదీన 'పద్మావతీ తిరుమణమ్' రాత్రి పదకొండుగంటల దాకా కూచుని చూసి, మాట యిచ్చారో, ఆ యమ్‌జిఆరే తనమాట నిలబెట్టుకు, వేదికమీద వాగ్దానాన్ని నెరవేర్చి, శంకుస్థాపన చేయటం, కూచిపూడి ఆర్ట్ అకాడమీకే కాదు, మద్రాసు ప్రజలకే కాదు, భారతజాతికే గర్వ కారణం. అంతటి మహోదారులు ఎందరున్నారీ లోకంలో! అకాడమీ అధ్యక్షులు జెవి సోమయాజులు సభా కార్యక్రమం నిర్వహించి, అకాడమీలో 150 విద్యార్థులలో 40 శాతానికి ఉచితంగా నాట్యవిద్య నేర్పుతున్నారనీ, కేంద్ర ప్రభుత్వం సాలుకి పన్నెండువేలు గ్రాంటు యిస్తున్నదనీ, ఆంధ్ర ప్రభుత్వం యిచ్చే పదిహేను వేల గ్రాంటు ఏడాదిక్రితం నిలిపివేశారనీ కళాభిమానుల పోషణతో ఈ విద్యాలయం మనగలుగుతున్నదనీ తెలిపారు. ఆర్థిక యిబ్బందుల మాట అటుంచి వెంపటి చినసత్యం చిరకాల వాంఛితం కార్యరూపంలోకి వస్తోంది; కూచిపూడి ఆర్ట్ అకాడమీకి తనదీ అంటూ ఒక భవనం మద్రాసులో ఏర్పడుతున్నది.

- యన్నార్ చందూర్

వగరు వగరుగ పుల్ల పుల్లగను తియ్య
తియ్యగా చేదుమ్రింగిన తెలుగుబిడ్డ
తొగరిపి చెక్కిళ్ల బాష్పాలు తుడుచుకొనుచు
జయము పల్కెను నవయుగస్వామి నీకు

—కరుణశ్రీ

## ప్రముఖ చిత్రం

పదకొండు సంవత్సరాల నాగపూర్ తర్వాత శ్రీవారికి చాందా (చంద్రపూర్) బదిలీ అయింది. చాందా నించి మేం ఆనందవన్ వెళ్ళేసరికి బాబా లేరు కానీ ఆయన కొడుకులిద్దరూ డా॥ వికాస్, డా॥ ప్రకాశ్‌లు వున్నారు. వికాస్‌కి, మమ్మల్ని తీసుకెళ్లిన మావారి పైఅధికారితో, అంతకు ముందే పరిచయం వుండడంవల్ల మమ్మల్ని సాదరంగా ఆహ్వానించి ఆనందవన్ అంతా చూపించి అక్కడ అందరూ తినే భోజనాన్ని మాకు కూడా పెట్టి, అపుడప్పుడు వస్తూండమని చెప్పి సాగనంపారు. తర్వాత ఒకటి రెండుసార్లు మావారు ఆనందవన్ వెళ్ళినా నాకు కుదరలేదు. ఈ లోగా అనుకోకుండా మాకు చాందానించి ఢిల్లీకి బదిలీ అవడంతో ఏమైనాసరే బాబాని కలుసుకోవాలని ఒక ఆదివారం ఆనందవన్‌కి వెళ్ళాము. మామూలుగా ఒక తెల్లపైజామా, దాని మీద మన గ్రామాలలో రైతులు ధరించే టటువంటి బనియను లాంటిది, మెడచుట్టూ నొప్పికి వేసుకునే 'కాలర్'- యింత మామూలుగా వుండే మనిషి గొప్ప తనం ఒక గంట సేపట్లో అర్థం అయిందినాకు. ఎదుటివారిని తన సహజ మాటల ధోరణితో కొత్తదనం పోగొట్టి, చమత్కారంతో నవ్విస్తూ నవ్వుతూ మాట్లాడే బాబా గురించి ఎంత చెప్పినా తరగదు. మహారాష్ట్రలోని ఒక మారుమూల అడవులలోని ఈ బాబా పూర్తిపేరు మురళీధర్ దేవీదాస్ ఆమే. 1914 డిశంబరు 26 న ఒక సంపన్న మహారాష్ట్ర బ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. హింగన్ గాట్‌లోని జమీందారీ కుటుంబంలో జన్మించిన మురళీధర్, చిన్నతనం నించీ సచేతన ప్రకృతికి సన్నిహితులు. ఆటవికులతో కలిసి వారి అమాయకతను, నిజాయితీని అభినందించేవాడు. నాగపూర్ విశ్వవిద్యాలయం నించి 'లా' పట్టా పొంది 'క్విట్ ఇండియా' వుద్యమంలో జైలు శిక్ష ననుభవించి, గాంధీ వినోబాజీలకు సన్నిహితుడై మహాత్ముని చేత 'అభయ్‌సాధక్' అని పిలిపించుకున్నాడు. తండ్రి ఆస్థి, జమీను చూస్తూ లా ప్రాక్టీసుచేస్తున్న మురళీధర్‌కు మనశ్శాంతి వుండేదికాదు. 1946 లో నాగపూర్‌లో బంధువుల యింటపెండ్లికి వెళ్ళిన మురళీధర్ దృష్టి ఒక అమ్మాయి మీదపడింది. ముసలిపనిమనిషి బట్టలు ఆరవేస్తూంటే ఆ అమ్మాయి ఆ పని మనిషితో - నీవు చాలా ముసిలిదానివి, నేను నీకు సహాయం చేస్తానని అనడం చూసి, తనకి తగిన జీవిత సహచరిణి ఆ అమ్మాయే అని, ఆ అమ్మాయి తల్లితండ్రులని కలుసుకుని, ఆమెను వివాహం చేసుకున్నారు. భార్యని సంప్రదించి, తను 'లా' ప్రాక్టీసు మానేసి, తండ్రి ఆస్థి మీద తనకున్న హక్కులు వదులుకున్నాడు.

1948 లో వరోరా మున్సిపాలిటి చైర్మన్‌గా ఎన్నికయి, అక్కడ దుస్థితిని

చూసి, పాయిఖానాల పారిశుధ్యానికి పూనుకున్నారు.ఒకరాత్రికుంభవృష్టిగా వర్షం పడుతుండగా మురళీధర్, వికారంగా కాలవలో పడున్న ఒక కుష్టు రోగిని చూసి స్తంభించిపోయాడు. అది ఆయన జీవితంలో పెద్ద మలుపు. భయమున్నచోట ప్రేమ వుండదని, ప్రేమ లేని చోట భగవంతుడు లేడని, ముందు ఈ భయాన్ని పారద్రోలాలని నిశ్చయించుకున్నాడు. ఆ సమయంలోనే ఏసు, గాంధీ, వినోబాల జీవిత సరళిని ఆదర్శంగా తీసుకుని వూరిచివర వెదురు బొంగులతో ఒక గుడిసె వేసి దాని లోకా కుష్టురోగిని తరలించి, అక్కడ కుదగ్గరలోవున్న దత్తాపూర్ వెళ్ళిచూసి, తనే సేవ చేయడం ప్రారంభించాడు. 1949 లో కలకత్తా వెళ్ళి 'స్కూల్ ఆఫ్ ట్రాపికల్ డిసీజెస్' లో చేరి కుష్టు రోగుల చికిత్స నేర్చుకుని, 1950లో మహారోగ సేవాసమితిని స్థాపించి ఆ విధంగా మురళీధర్, బాబా ఆమెటె అయ్యాడు. చంద్రపూర్ జిల్లా మహారాష్ట్రలో అడవులకు, కలపకు ప్రసిద్ధి. మధ్యప్రదేశ్ గవర్నమెంటు నించి 25 హెక్టార్ల భూమిని, మహరాష్ట్ర నించి 80 హెక్టార్ల భూమిని సంపాదించి 'మహారోగి సేవాసమితి' ని స్థాపించాడు బాబా. భార్య సాధనా తాయ్ యిద్దరు కొడుకులు ప్రకాశ్, వికాశ్‌లు, ఆరుగురు రోగులతో, జేబులో 14 రూ లతో, ఆ అడవి ప్రదేశానికి వెళ్ళాడు బాబా. ఆ అడవి ప్రదేశాన్ని శుభ్రపరిచి వెదురుబొంగులతో యిళ్ళువేసి, నూతులు తవ్వించి, అక్కడ నివాస మేర్పరచుకొన్నాడు. అదే నేటి ఆనందవన్ — ఆనందప్రదమైన అడవి — రోగుల రోగాలను మరపింప చేసేది.

ఈనాడు ఆనందవన్ 450 ఎకరాల స్థలం కలది. యిందులో చాల భాగం రోగులు – వెయ్యిమంది దాకా వుంటారు. దీనికి అనుబంధించి ఆసుపత్రి వుంది. దానికి మెడికల్ డైరెక్టర్ బాబా పెద్దకొడుకు వికాస్; భార్య డాక్టర్ భారతి అతనికి అన్నివిధాలా సాయం చేస్తుంది. ఇలా చికిత్స చేయబడ్డ రోగులకు వ్యవసాయం జీవనోపాధి. బాబాకి విజ్ఞానశాస్త్రం మీద భూమాత మీద ఎనలేని నమ్మకం. అందుకే ఆనందవన్ లో చేసే ప్రతీ పని కూడ శాస్త్రీయంగా ఉంటుంది. అరటి, బొప్పాయి, ద్రాక్ష లాంటి ఫల వృక్షాలు, గోధుమలు, వరి మొదలైన ధాన్యాలు, ప్రత్తి అన్నీ పండిస్తారు. వాళ్ళకి సరిపోగా మిగిలిన పంటను, వాళ్ళదే మరొక సంస్థకు తరలింప బడుతుంది. వ్యవసాయంతో పాటు యిళ్ళ నిర్మాణం కూడా ప్రారంభించి రోగులకు ఆ వృత్తి కూడా నేర్పారు. యిప్పుడు ఆనందవన్‌లో వడ్రంగులు, తాపీ పనివారు మొదలైన అన్ని రకాలవృత్తులు నేర్చినవారు వున్నారు. ఆనందవన్‌లోని కాలేజి భవనం, మిగిలిన గృహాలు అన్నీ స్వయం కృషితో వీరు నిర్మించిన, నేను. ఒకరి వదనించి చెయిచాచి యాచించడం, వాళ్ళనుంచి నిధి పుచ్చుకోడం బాబాకి ఎంత మాత్రం కిట్టని విషయం.

ఆనందవన్‌లో నివసించేవారి సంఖ్య ఎక్కువయిన కొలదీ కొత్త కొత్త వ్యాపకాలు బట్టలు నేయడం, బుట్టలు అల్లడం, బట్టలు కుట్టడం, యిప్పుడిప్పుడే స్వయంవుపాధి పథకం క్రింద చిన్న పరిశ్రమలు... ప్రాథమిక పాఠశాల, పోస్టాఫీసు కూడా వున్నాయి. వికలాంగులకు ఏర్పరచిన విభాగాన్ని సంధి నికేతన్ అంటారు. ఆనంద వన్‌లోని రోగులు నిర్మించినదే ఆనంద్ నికేతన్ కాలేజీ. ఇందులో 1200 మంది విద్యార్థులు మహారాష్ట్ర ఆంధ్ర పల్లెప్రాంతాల నుంచి వచ్చి చదువుకుంటున్నారు. చికిత్స చేయ పడ్డ రోగులకు వారి వారి యిష్టాల మీద ప్రతి ఏటా జరిగే "ఫ్రెండ్స్ మీట్" లో వివాహాలు చేసి, వారిని వేరే యిళ్ళలో కాపురం పెడతారు – అదే ముక్తిసదన్. సుఖసదన్‌లో 50 మందిరోగులతో వుమ్మడి వ్యవసాయం, మరికొన్ని గృహ పరిశ్రమలు కల్పిం చారు. ప్రతీ సభ్యుడూ ఒక వికలాంగు నికిగానీ ఒక వృద్ధ రోగికి గానీ సహా యం చేయాలి. వరోరా స్టేషన్ వద్ద దొరికిన రెండు రోజుల పసిబాలిక రాకతో ఆనందవన్‌లో మరొక సంస్థ వెలిసింది – అదే గోకుల్. అలాటిఅనాథ పిల్లల్ని ముక్తిసదన్‌లోని దంపతులు దత్తత చేసుకుంటారు. ఉత్తరాయన్ అన్నది నిజంగా ఉత్తరాయణే – దారి తెలియని వృద్ధులకు విజ్ఞానఖని లాంటిది. యివి కాక ముక్తాన్ అన్న ఓపెన్ ఎయిర్ థియేటర్, ప్రత్యేకమైన గులాబీతోట - 140 రకాల గులాబులు గుభాళిస్తూ వుండడమే కాదు – గులాబీ అంటే వినడమేకానీ తాకి ఎరుగని అంధ బాలలు, ముళ్ళులేని గులాబీల ద్వారా గులాబులని చేతితో స్పృశించి తెలుసుకో గలుగుతారు. మహాత్ముడు కలలు కన్న స్వయం సమృద్ధిగల పల్లెజీవితం మార్గాన 'శ్రామిక విద్యాపీఠ్' అని ఆనందవన్‌కి 60 మైళ్ళ దూరంలోగల సోమనాథ్ దగ్గర 25 రోగులు, కొంత మంది దంపతులతో ప్రారంభించారు. ఇక్కడ కూడా అడవులను బాగుచేసి, వ్యవసాయం, దారులనిర్మాణం, బావులు తవ్వడం మొదలైనవి ప్రారంభించారు. తన చిన్న తనపు సహవాసులైన మడి యాగేండుల మీద బాబాకు ఎప్పుడూ ప్రత్యేమైన అభిమానం. వీరు ఆంధ్ర ప్రదేశ్ మధ్యప్రదేశ్ మహారాష్ట్రాణి మధ్య అడవులలో నివసిస్తారు. జంతు వులని వేటాడి కాల్చుకుతినే వీరి పద్ధతి 1971 లో బాబా ఆయన సతీమల సాధనతాయ్ వెళ్లారు. బ్రహ్మగడ్‌లో జీవనం ప్రారంభించి, 'లోక్ బిరాదరీ' ని స్థాపించారు. వారు ప్రారంభించిన ఈ సంస్థని బాబా చిన్న కొడుకు డాక్టర్ ప్రకాశ్, అతని భార్య డాక్టర్ మందాకినీ నిర్వహిస్తున్నారు. వారితోపాటు బాబా కూతురు రేణుక, ఆమె భర్త ఇంజనీర్ మనోహర్ మరికొందరు నవయువకుల ఈ కార్యక్రమంలో పాల్గొంటున్నారు నవ భారత యువకుల మీద బాబా అచంచలమైన విశ్వాసం. 30 స వత్సరములకి పూర్వం చిన్న సంస్థ ప్రారంభింప బడిన ఆనందవన్ శాఖో

శాఖలుగా అనేక రకాలైన సంస్థలుగా విస్తరించింది.

ప్రతీ సంవత్సరం 100 ఎకరాల భూమి సాగులోకి తీసుకు వస్తున్నారు. ఆనందవన్ నించి 10 గంటల బస్సు ప్రయాణం హేదులకాసా ప్రొజెక్టులోని లోక్ బిరాదరీ సంస్థకు. యిందులో జనరల్ ఆసుపత్రి 140 విద్యార్థులు గల విశ్వ విద్యాలయం, 5 ట్రెయినింగు సెంటర్లు వున్నాయి. నిరుడు సంవత్సరం 47 టన్నుల ఆహార ధాన్యాలు, 55,000 లీటర్ల పాలు, 3 టన్నుల పైన కాయకూరలు పండించారు. 50 లక్షల బడ్జెట్‌కి 30 శాతం మాత్రం ప్రభుత్వ గ్రాంటు. అందులో 80 శాతం ఆనందనికేతన్ అనుబంధించిన విశ్వవిద్యాలయంకే ఖర్చుపెట్టబడింది. 'My basic concept is that charity destroys and only work builds a person. These outcaste people needed a chance, not charity and you can see the tremendous use they have made of the opportunity given them' అంటారు బాబా. రోగులకు నూతన వుత్సాహాన్ని అందజేస్తూ అక్కడవున్న అడవులను వ్యవసాయానికి వుపయోగకరంగా చేసి సస్య శ్యామలమైన పంటభూమి, నివాసగృహాలుతో, చిన్న పిల్లల కేరింతలతో, కాలేజీ పిల్లల కంఠనాదాలతో మారు మ్రోగునట్లు చేసారు బాబా. మీరు నాగపూర్‌వెళ్తే ఆనందవన్ తప్పక చూడండి. భగవంతుడెక్కడో లేడు - మానవతామూర్తి అయిన బాబా లాటి వారే నిజమైన భగవత్స్వరూపులు.

—అయ్యగారి కల్పకం
బలంగీరు - ఒరిస్సా

ప్రచురించవచ్చును. కాని, ఈ లేఖల్లో నార్ల ఎక్కువగా తమ అనారోగ్యం, వార్ధక్యం గురించి బాధపడటం కనబడుతుంది. రెండు మూడు సందర్భాల్లో తనను పత్రికారంగంనుండి వైదొలగించిన వారి ప్రస్తావన కూడా వున్నది. చివరి వుత్తరంలో నార్ల, భగవద్గీతను ఒక మిథ్యగా నిరూపిస్తూ యింగ్లీషులో ఒక విమర్శన గ్రంథం సిద్ధపరుస్తున్నట్లుగా చెప్పారు. అది పూర్తి చేశారా, ప్రచురణ జరుగుతున్నదా అనే సందేహాలు పాఠకునిలో మిగిలిపోతాయి.

ఈ లేఖల ప్రచురణ నార్ల స్మృతికి వుపకారమా? చెప్పలేము.

—కల్పనాదేవి

86 తెలుగు ఫిలిం డైరీ. ఎడిటర్ అండ్ పబ్లిషర్: జగన్, ప్రచురణ: క్రాంతి పబ్లికేషన్స్, 34 యమ్‌వి కోవెలవీధి టి. నగర్, మద్రాసు-600017. వెల: పదిరూపాయిలు.

నటీ నటులు, దర్శకులు, నిర్మాతలు, పంపిణీదారులు, ఛాయాగ్రాహకులు, సంగీతకారులు, పాత్రికేయులు- యిలా తెలుగు సినీ పరిశ్రమ వివిధ శాఖలకు జెందిన యావన్మంది పేర్లూ యడ్రసులూ, టెలిఫోన్ నెంబర్లతో సహా, పరిశ్రమతో సంబంధం వున్నవారికీ ప్రేక్షకులకీ అభిమానులకీ ఉపయోగపడే రీతిని వెలువరించిన ఈ డైరీలోని ప్రతిపేజీ సమాచార వివరణతో ఎంతో అందంగా రూపు దాల్చింది - అజయ్ ప్రసాద్ పేజీమేకప్ విషయంలో తీసుకున్న శ్రమకు ఫలితంగా! ప్రింటింగ్ బావుంది - [illegible] చిరంజీవి ముఖచిత్రం గల ఈ డైరీలో నెలకి రేండేసి పేజీల చొప్పున ఎంగేజ్‌మెంట్ పాడ్ (1986 ఏప్రిల్ నుంచి 1987 మార్చి వరకు) కూడా వుంది. అలాగని మీరు దానిని అశ్రద్ధగా టేబుల్ మీద వొదిలేశారా, మాయమవగల ప్రమాదం ఉంది.

—యస్. యస్.

ఈ మధ్య అందినవి:

'అక్షర దీపం' - దేవులపల్లి రామానుజరావు గారికి అభినందన ప్రచురణ. చైతన్య సాహితీ సమాఖ్య, హైదరాబాదు -29 .... రు 40-00.

'దైవ ప్రవక్తలు' - నాలుగోభాగం. తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాదు - 2 .... రు 6-75

ఆధునిక మహాభారతము-శేషేంద్ర కృతి - శ్రీ శేషేంద్ర సాహిత్యపీఠము .... నవయుగ బుక్ హవుస్, హైదరాబాదు .... రు 20-00,

---

## అవకాశం

మద్రాసు తెలుగు అకాడెమీ సాంస్కృతిక సంస్థ, గత ఐదు సంవత్సరాలుగా, సంగీత, నాటక, నృత్య, సాహిత్య రంగాలలోని ప్రముఖుల సహాయ సహకారాలతో దేశసమైక్యతకై పాటుపడుతున్నది. ఈ సంస్థ తన ఆదర్శాలలో ఒక భాగంగా, దేశంలోని యువ గాయనీ గాయకుల కళాకారుల ప్రతిభని గుర్తించి తమ కార్యక్రమాలలో వారికి తగు అవకాశాలను కలిగించి, ప్రోత్సహించాలని అనుకుంటున్నది. అవకాశాన్ని అభిలషించేవారు, ఈ అడ్రసుకి వ్రాయవచ్చు: టి వి కె శాస్త్రి, కన్వీనర్ - మద్రాసు తెలుగు అకాడమీ, 25, మెలానీ రోడ్, మద్రాసు - 600 017.

# మాతృదేవి

మాతృదేవికి నమస్కరించు చున్నాను
ఔదార్య ధారాస్రవంతి ఆమె
వర్ష మేఘములు మాసిపోవ
ప్రజ్వలించు దక్షిణ సమీరములచే
మ్రగ్గి, మధురతరమైన ఫలము ఆమె
జ్యోత్స్నా వైభవ దీప్తులచే
విహ్వాల కంపితములు
నిశీధములు ఆమెవి
ఆనందదాయకములు హాసములు ఆమెవి
శాంత సరళములు వాక్కులు ఆమెవి.

— President Mitterrand



(భారతోత్సవము ముగింపులో
కళాత్మక, సంస్కృతీ ఉత్సాహ ఉద్వే
గముల తిలకించినపుడు ....
ఫ్రాన్సు అధ్యక్షులు మిత్తరాంద్ చదివిన కవిత
....1986 జూన్ 15, పారిస్‌లో....

డా॥ బెజవాడ గోపాలరెడ్డి
(మద్రాసు - జూన్ 17, 1986)



సమీక్షలు

# చిత్రజగతి

## సంయుక్తావారి 'వేట'

సయమీస్ ట్విన్స్‌ని ప్రత్యక్షంగా చూసి, 'కార్సికన్ బ్రదర్స్' నవల రాశాడు అలెగ్జాండరు డ్యూమాస్ (1827 – 1890). ఆ పేరుగల హాలీవుడ్ చిత్రం ఆధారంతో జెమినీవారు నిర్మించిన 'అపూర్వ సహోదరులు' అఖండ విజయం సాధించింది. తెలుగు సినీచిత్ర రంగంలో ద్విపాత్రాభినయం అప్పట్నుంచే ప్రారంభమయింది. అలెగ్జాండర్ డ్యూమాస్ 'కౌంట్ ఆఫ్ మాంటి క్రిస్టో' నవల, పన్నెండుకోట్ల ప్రజలని పాలించిన నెపోలియన్ చక్రవర్తి, అరువేల జనాభా గల ఎల్బా దీవిలో, ఖైదీగా వున్ననాటి రోజుల కథ ...అక్షరం ముక్కరాయడం చేతగాని నావికుడు ఎడ్మండ్. ఓడ కెప్టెన్ కన్ను మూస్తూ, నమ్మకస్తుడగు ఎడ్మండ్ చేతికి, ఒక లేఖ యిచ్చి, అది పారిస్‌లో ఒకరికి అందజేయమంటాడు. ఎడ్మండ్, మార్సెయిల్స్‌లో (రేవు పట్నం) తనప్రియురాలి మెర్సిడీస్‌ని కలుసుకుంటాడు. ఈ మెర్సిడీస్‌పై వ్యామోహం గల మరొక యువకుడూ, అతని మిత్రులూ (వారు నావికులు) కలిసి, ఎడ్మండ్‌ని, పెళ్లి ముహూర్తానికి సిద్ధమవుతున్న ఎడ్మండ్‌ని, చిక్కుల్లో పెడతారు. ప్రభుత్వ న్యాయవాది వెల్ట్ పోర్టు, ఎడ్మండ్ నిర్దోషి అని తెలిసి కూడా, ప్రజల పక్షాన పోరాడుతున్న తన తండ్రికని ఉద్దేశింపబడిన ఆ రహస్య లేఖ, నేర్పుగా రాబట్టి, కాల్చేసి, 'నీపై ఫిర్యాదు వున్నది గనక ఈ ఒక్క పూటకీ నిన్ను అదుపులోకి తీసుకుంటా' నంటూ, ఎడ్మండ్‌ని జైలుకి పంపిస్తాడు — మార్సెయిల్స్ సమీపంలో సముద్రాన్ని అంటిపెట్టుకు ఒక ఎత్తయిన కొండ మీదున్న పాతకాలపు కోటవంటి కారాగారానికి. ఆ చీకటి కొట్లో ఏడేళ్లు గడిచాక, మొదటిసారిగా మరొక కంఠం వినబడుతుంది ఎడ్మండ్‌కి — ఫాదర్ ఫారియాకంఠస్వరమది. పొగగొట్టంనుంచి రాలిన నుసితో సిరా చేస్తాడాయన, ఇచ్చిన ఆహారంలో మిగిలిన ఎముకలతో సూదులుచేస్తాడు. అటువంటి ఫాదర్ ఫారియా ఎడ్మండ్‌కి ఎబిసిడిలు నేర్పుతాడు; చదువు నేర్పుతాడు; ప్రపంచమంటే ఏమిటో తెలియజెపుతాడు ; మూడు తరాల క్రితం స్పానిష్ రాజ వంశీయులు, శత్రుభయం కారణంగా భూస్థాపితం చేసిన బంగారు కణికలూ వజ్ర వైడూర్యాలు,

'మాంటిక్రిస్టి'లో వున్నాయనీ, ఆ దీవిలో అవి ఎక్కడ వున్నదీ మాప్ వేసి యిస్తాడు; తనకు కాలం చెల్లిపోయిందనీ, ఎడ్మండ్ బయట పడ్డాక, ఆ ధనం పాతర తెలుసుకు లోకోపకారం చేయమనీ చెప్పి, ఫాదర్ ఫారియా చనిపోతాడు; ఆయన శవాన్ని బస్తాలోకుట్టి సముద్రంలోకి గిరవాటు వేస్తారు కాసేపట్లో; జైలు పాలకులకళ్లు గప్పి, ఆ బస్తాలోకి ఎడ్మండ్ చేరుతాడు: పెద్ద రాయి కట్టి బస్తాని సముద్రంలోకి గిరవాటు వేస్తారు. టర్కీ నుంచి దొంగ సరుకు జేరవేసే ఒక నౌకలోని వారు యితనిని రక్షిస్తారు - ఆ నౌకలోనే కళాసీగా పని చేస్తూవుంటాడు. కొంతకాలం అలా కళాసీగా పనిచేశాక, మాంటిక్రిస్టో – అనే మాట వినబడుతుంది; ఒకరోజున తమ నౌక ఆ దీవిలో ఆగుతుంది; తను దిగుతాడు. కాలికి దెబ్బ తగిలిందనే సాకుతో, రెండు రోజులు అక్కడే వుండి, తిరుగు ప్రయాణంలో జాయినవుతానంటాడు .... బంగారు కణికలూ వజ్ర వైడూర్యాలూ గల మందసం ఎక్కడ వుందో తెలుసుకు, ఒకటి రెండు మాత్రం అందులో నుంచి తీసుకు, మళ్లీ, దానిని భద్రంగా భూస్థాపితం చేసి, మరొక దొంగ రవాణా ఓడ మీద జినీవా చేరుకు, అక్కడ బ్రిటిష్ పాస్ పోర్ట్ సంపాదించి, ఒక నౌక అద్దెకి తీసుకు, మాంటిక్రిస్టో వెళ్లి, అక్కడి ధన రాసులన్నీ గుప్తంగా తరలిస్తాడు. అక్షర జ్ఞానంలేని ఎడ్మండ్, లార్డ్ విల్ మోర్గా (కౌంట్ ఆఫ్ మాంటిక్రిస్టో), ఫాదర్ బూసీగా మారి, తిరిగి మార్సెయిల్స్‌లో మకాం పెట్టేనాటికి అతని వయసు 34. అంటే పధ్నాలుగేళ్లు అజ్ఞాతంగా గడిచింది. మరొక ఏడెనిమిదేళ్లపాటు కథ నడుస్తుంది. మెర్సిడీస్‌కి అప్పటికే పెళ్లయిపోయింది; ఎడ్మండ్‌ని మోసగించినతనే ఆమె భర్త. ద్రోహంచేసిన మిత్రుడు, మెర్సిడీస్‌ని వివాహమాడిన వంచకుడు, పెద్ద తనంలో వున్న తన తండ్రి పోషణ కోసం డబ్బు యిస్తే అది కాస్తా మింగేసి, ఆవృద్ధుడు ఆకలిదప్పులతో మరణించేందుకు కారకుడైన వడ్డీ వ్యాపారి, నిర్హేతుకంగా తనని పధ్నాలుగేళ్లు యమచెరకు గురిచేసిన ప్రభుత్వ న్యాయవాది, ఒకరి తర్వాత ఒకరుగా హతులయాక, తన గుండెమంట చల్లారాక, విధి వంచితురాలైన మెర్సిడీస్‌నీ ఆమె కుమారునీ క్షమించి, బానిసగా అమ్మబడుతున్న హైదీ అనే అమ్మాయిని రక్షించి, ఆమె తనకి తోడుగా, ఈ కుతంత్రాలకి కుత్సితాలకి దూరంగా వున్న దీవులకు వెళ్లిపోతాడు, లార్డ్ విల్‌కమోర్–ఫాదర్ బూసీ నామాంతరాలు గల ఎడ్మండ్. ఈ ప్రపంచ ప్రఖ్యాత నవలని 'పాత కెరటాలు' లో ('స్వాతి' మాసపత్రిక 1982 – ఫిబ్రవరి, మార్చి సంచికలు) మాలతీ చందూర్ పరిచయం చేశారు.... సంయుక్తా నిర్మాతలు అలెగ్జాండర్ డ్యూమాస్ మాతృక అంగీకరించినా అంగీకరించకపోయినా, 'వేట' చిత్రానికి మూలాధారం అదే! కథాకాలం 1939 గా, బ్రిటిష్

పాలన రోజులుగా, ప్రతాప్ (చిరంజీవి) అనే నావికుడు, ప్రాసిక్యూటర్ బెనర్జీ (రంగనాథ్) స్వార్థ చింతన కారణంగా, ఎనిమిదేళ్లు అండమాన్ జైలులో బంధింపబడినట్లు చూపారు. అది రెండవ ప్రపంచ యుద్ధకాలం, జపాన్ విజృంభణ రోజులు - బ్రిటిష్ ఇండియా ప్రభుత్వం అండమాన్, నికోబార్ దీవులని యించుమించు ఖాళీ చేసింది. ప్రివ్యూ చూస్తున్నప్పుడు పక్కనున్న మిత్రుని చెవిలో ఈమాట చెప్పగా 'యిది సినిమా కాదటండీ — అవన్నీ ఎవరు పట్టించుకుంటారు?' అన్నారు. నిజమేనేమో! ప్రతాప్ ప్రియురాలు సరోజ (జయప్రద); కోటీశ్వరుడై పునఃప్రవేశం చేశాక అతనికి నీడలా ఉంటుంది జ్యోతిర్మయి (సుమలత). ప్రతాప్‌కి వివేకం కలిగించి, తనలోని స్వాతంత్ర్యజ్యోతిని అతనిలో వెలిగించిన పాత్ర జగ్గయ్యది. ఎంతో వ్యయప్రయాసలకోర్చి నిర్మించిన భారీ చిత్రం 'వేట'—యాక్షన్ హీరో చిరంజీవి, తనని మోసగించిన నలుగురినీ వేటాడటం యిందులోని ప్రధానాంశం. చిరంజీవి నటన ప్రశంసనీయంగా ఉంది. చిత్రంలోని రెండవ సగం మాంఛి వేగంతో ప్రేక్షకులని ఉత్సుకతతో రంజింపచేస్తుంది. పెద్ద పెద్ద సెట్టింగులతో కూడిన మూడు డ్రీమ్ సీక్వెన్స్ వున్నాయి. వానరాత్రి వేళ ప్రతాప్‌తో సమాగమ ఫలితమే సరోజకు కలిగిన సంతానం అనే సెంటిమెంట్ - తెలుగు ప్రేక్షకులకి కావల్సినది-ప్రవేశపెట్టారు. జయప్రద, సుమలత పాత్రోచిత న్యాయం చేశారు. దర్శకత్వం: కోదండరామరెడ్డి. నిర్మాత: తిరుపతిరెడ్డి.

## గీతాకృష్ణావారి 'సిరి వెన్నెల'

హరిప్రసాద్ (సర్వదమన బెనర్జీ) అంధగాయకుడు; చెల్లెలు సంయు (సంయుక్త) అతనికి తోడు. అతని వేణువూ ఆమె కంఠమూ శ్రావ్యగానమై ప్రాచీన శిల్పాల ఆ 'పాతకోట' చూసేందుకు వచ్చే టూరిస్టులని అలరిస్తూ వుంటాయి. తాము పొందిన శ్రవణానందానికి వారు తమ కానుకగా యిచ్చే నాణాలూ నోట్లూతో ఆ అన్నా చెల్లెళ్ల పొట్ట పోసుకుంటూ వుంటారు. దానిని దయాధర్మ బిచ్చమని అన్నా తప్పులేదు; ఎంచేతనంటే మనది 'ఆది భిక్షువు'ని (శివుడు) కొలిచే సంస్కృతి. టూరిస్ట్ గైడ్ సూరి బాబుకి (శుభలేఖ సుధాకర్) హరిప్రసాద్ పోటీదారుగా కనిపిస్తాడు — టూరిస్టు లందరూ వీరి పాటకు ఆకర్షితులై యిటువైపు వచ్చి, ఆ యిచ్చేదేదో హరి పరిచిన తువ్వాలు మీద వేసేస్తూ వుంటారు. హరిని ఈ ఊరునుంచి సాగనంపేందుకు సూరి బాబు ఒక కుట్రపన్నుతాడు. తను దాచుకున్న వెయ్యిరూపాయిలూ ఆ పందెంలో వొడ్డటమే గాక, అనుపమ విజయం సాధించి, జ్యోతిర్మయి (మూన్ మూన్ సేన్) ఆదరాను రాగాలకు పాత్రుడవుతాడు హరిప్రసాద్. జ్యోతిర్మయి ఈ అంధగాయకునికి సూర్యోదయ మంటే ఏమిటో వేలికొనల భాషలో, అతనికి

ఉద్రమయేటట్లు స్వర్గానుభూతితో చెబుతుంది. మోమున మోముజేర్చి. తన మేలిముసుగుతో, సూర్యుడు మేఘాల నుంచి బయటపడటమంటే ఏమిటో చెబుతుంది. సముద్ర కెరటాలపై సూర్య కిరణాలని, తన శిరోజాలు అతని చెంపలపై నుంచి జారడం ద్వారా చెబుతుంది. తనకొక కొత్తలోకం చెబుతున్న జ్యోతిర్మయి 25 వ నెంబరు రూమ్ వద్దకు వచ్చి, మేఘాలూ మేఘ గర్జన అనగా ఏమిటని అడుగుతాడు. 'నేను ప్రకృతిని, నీవు పురుషుడివి – ఈ గుండె దడదడ విను. ఈ హృదయ గర్జన ఎండిన నేలపై వర్షమై కురిసి, పుడమిని పారవశ్యంలో ముంచుతుంది. ఆకాశం ఏడు రంగులచీర ధరిస్తుంది, ఆ హరివిల్లుకి నెమలి పురివిప్పి నాట్య మాడుతుంది' – అంటూ జ్యోతిర్మయి హరిప్రసాద్‌కి ప్రకృతి ప్రతి రూపమైన స్త్రీలో, స్త్రీ ముఖంలో ఏడు రంగులూ ఏ ఏ స్థానాలలో వున్నాయో, భ్రుకుటి, చెక్కిలి, నాసిక, గళమూ యిలా వరసగా అతని పెదవులకి తెలిసే విధంగా చెబుతూ, అధరచుంబనలోని అరుణ వర్ణాన్ని అతని అనుభవంలోకి తెస్తుంది. స్పెషల్ టూరిస్ట్ బస్‌లో మిగతా ప్రయాణీకులతో బాటు ఈ అన్నాచెల్లెలూ వెళ్తారు; తమ పాటలతో వారిని ఆనందింప జేస్తారు; రికార్డ్స్ కంపెనీ డైరక్టరుతో (రమణమూర్తి) పరిచయమవుతుంది; ప్రకృతిలో లీనమై భూపాల రాగం పలికిన హరిప్రసాద్‌లోని ప్రతిభని, స్వీయానుభూతి వ్యక్తమయే జీవకళని, ఆ డైరక్టరు గుర్తించి, హరి, పండిట్ హరిప్రసాద్ అయేందుకు, వారధి అవుతాడు. హరిప్రసాద్ తన ప్రతి రికార్డూ జ్యోతిర్మయికే అంకితమిస్తాడు. రామచిలుకలా ఎగురుతూ నానాదేశ సందర్శనం చేసే జ్యోతిర్మయి, అంకుల్‌ని, అంటే రికార్డ్స్ కంపెనీ డైరక్టరుని చూసేందుకు ఆ వూరొస్తుంది.... బంధువైన సూరిబాబు పెళ్లికి వచ్చి వున్నారు హరిప్రసాద్, అతని చెల్లెలు సంయుక్త. రైల్వేడీసిల్ కారులో పరిచయమవుతారు మూగచిత్రకారిణి సుభాషిణి (సుహాసిని), ఆమె సోదరుడు. వీరితో బాటు జట్కా బండిలో పెళ్లివారింటికి వస్తారు. హరిప్రసాద్ తాతగారు మనుమని స్నేహితులని తమతోబాటే వుండి పొమ్మంటారు. పుట్టి పెరిగిన ఊళ్లో జరుగుతున్న సన్మాన సందర్భంగా సుభాషిణి ఆ గాయకుని చిత్రపటం ఎంతో భావయుక్తంగా వేస్తుంది. హరిప్రసాద్ పట్ల ఆమె మనసు ఆర్ద్రమవుతుంది; కాని, అప్పటికే అతని హృదయంలో చెరగని స్థానం పొంది ఉంది జ్యోతిర్మయి. అంకుల్ ఇంటికి చుట్టపు చూపుగా వచ్చిన జ్యోతిర్మయి, హరిప్రసాద్ యింత గొప్పవాడవటం విని ఆశ్చర్య పోతుంది; ప్రతి రికార్డూ తనకి అంకిత మివ్వడం ఆమెని మరింత ఆశ్చర్య విభ్రమంలో ముంచుతుంది. అప్పటికే జ్యోతిర్మయి శిల్పం–మనిషిని చూడకుండా హరిప్రసాద్ మాటలనీ బట్టి, అతని వర్ణనబట్టి - తయారుచేసి వుంటుంది సుభాషిణి. స్వేచ్ఛగా ఎగిరిన రామచిలుక (జ్యోతిర్మయి). హరికి

భార్యగా తను ఎంతమాత్రం తగనని అంతర్యంలో నిశ్చయించుకు, తనకి డాక్టర్ నరేష్ కుమార్‌తో పెళ్లి ఖాయమైందని అతనిని నమ్మించి, పరస్పర ప్రేమానుభవానికి మనసులు చాలవా అని అతనిని మాటలలో వొప్పించి, తన కళ్లు అతనికి 'గ్రాఫ్ట్' చేసే ఏర్పాట్లన్నీ జాగర్తగా చేసి, పెళ్లికూతురు అలంకారంతో తనువు చాలిస్తుంది - తనని అత్తవారింటికి సాగనంపినట్లుగా హ రి ప్ర సా ద్ నమ్మాలనేది తన చివరి కోరికగా లేఖలో చెబుతూ! తాత గారితో సహా అందరూ అవిధంగానే చేస్తారు – ఆ దయనీయ బాంధవ్య పరిణామానికి! చుట్టూ వున్నవారు తనని 'అసత్యం' లో అట్టేపెట్టినప్పటికీ, స్మశానానికి వెళ్లి ఆ చితిలో అక్షింతలు వేసివస్తాడు హరిప్రసాద్ .... జ్యోతిర్మయి వంటిదే, తను సృ ష్టిం చి న వెలుగులో, తనని తను దహించుకు, విశ్వకాంతిలో ఐక్యం కాగలదు – సామాన్యుల కది సాధ్యంకాదు. తత్వాలూ వేదాంతాలూ మాట్లాడకుండా, ఇంద్రధనుస్సుని ఎంత అం ద ం గా చూపిందో, ఆత్మార్పణ కూడా అవిధంగానే చేసుకోగలిగింది .... పామ్‌గ్రొవ్ ప్రెస్‌మీట్‌లో మూన్ మూన్ సేన్‌ని చూసినప్పుడు, ఈమె యింత రమణీయంగా, తెలుగు ప్రేక్షకులు మర్చిపోలేని విధంగా, తన పాత్రని పోషిస్తుందని అనుకోలేకపోయాము ; సర్వదమన బెనర్జీ గురించి మొదట్నుంచీ సందేహం లేదు– అంధ గాయకునిగా అతను మెప్పించగలడని తెలుసు. ఇక, సుహాసిని, తెలుగు వారి చె ల్లె లు : నోటితో మాట్లాడే అవకాశం లేదుగనక కళ్లలో కావ్య గీతిక లొలికించింది .... సీతారామ శాస్త్రి పాటలు, మహదేవన్ స్వరకల్పన, సుశీల – బాలు - వసంత గాత్రం.... 'విధాత తలపున ప్రభవించినది - అనాది జీవనవేదం ఓం - ప్రాణనాడులకు స్పందన నొసగిన అది ప్రణవ నాదం ఓం'; 'ఎదకనుమలలో ప్రతిధ్వనించిన గానం'; రాళ్లే జవరాళ్లయి నాట్యమాడాయట; స్వాతి వానలో ఆత్మ స్నాన మాడిందట; 'తరుణుల తనువుల వెన్నెల - తరగలుగా ఊగువేళ... పాటల్లో పాడలేనిది, నోటి మాటల్లో చెప్పలేనిది - మీ గుండెల్లో నిండి ఉన్నది - ఆ బండల్లో పలుకుతున్నదట.... 'మెరిసే తారలదే రూపం, విరిసే పూవులదే రూపం, అది నా కంటికి శూన్యం... గానం పుట్టుక గాత్రం చూడాలా,.. ఈ వెదురును మురళిగ మలచి, నాలో జీవన నాదం పలికిన, నీవే నా ప్రాణ స్పందన'... 'ఆది భిక్షువు నేమి అడిగేది...' ...ఇలా ప్రతి పాటా మళ్లీ మళ్లీ వినాలనుకుంటారు... రికార్డ్స్ కంపెనీ డైరక్టరు మనుమరాలుకి బృందావనం చూపించమని అడిగే అంధ బాలిక వయసులో మార్పులేకపోవడ మొక్కటే 'యూనిటీ ఆఫ్ టైమ్'కి సంబంధించిన చిన్న పొరబాటు - రెండోసారి వచ్చినప్పుడు, ఆ అమ్మాయికి గౌను బదులు పైట అయితే, రమణమూర్తి చెప్పిన 'సంవత్సరాల'కి సరిపోయేది, ఇది చాలా చిన్న విషయం... పామ్‌గ్రొవ్

ప్రెస్ మీట్‌లో ముఖ్యులైన ముగ్గురు ఆర్టిస్టులూ, దర్శకులు విశ్వనాథ్ స్వయంగా వేసి చూపించిన దానిలో ఏ శాతం మేము వేయగలిగామేమో - అన్నారు. వినయం కోసం చెప్పిన మాటలు కావవి - ఫీలింగ్‌తో అన్నవి. అటువంటప్పుడు ఈ చిత్రానికి యింత చక్కటి రూపురేఖల నివ్వడంలో, యింత అందంగా తీర్చి దిద్దడంలో దర్శకశిల్పి విశ్వనాథ్, ఈ కళాసృష్టిలో ఏవిధంగా లీనమై రసమయ కావ్య ఖండిక నందించారో ప్రేక్షకులు ఊహించుకోవచ్చు. 'సిరివెన్నెల' నిర్మాతలు (గీతాకృష్ణా కంబైన్స్) యిందు కోసమే యిన్నాళ్లూ నిరీక్షించారు; వారి నిరీక్షణ ఫలించింది. ★



ఎవరెవరు? ఏ చిత్రంలోనిది ఆ వేషధారణ? సరిగ్గా చెప్పగలిగిన మొదటి ఇరువురికీ పదేసి రూపాయిలు బహూకరించగలము. ఎక్కువ మంది చెప్పగలిగినప్పుడు చీట్లువేసి మొదటి ఇరువురికే బహుమతి ఇవ్వడం జరుగుతుంది. మీ జవాబు కార్డుమీదనే వ్రాయండి. మాకు అందవలసిన చివరి తేది: 10-8-1986.

JAGATI - 2, Kutchery Road, P B 2922, Madras - 600 004

# A Week in Araku

Krishnamurthy was to arrive by two and we were to proceed to Paduru by four, after completing some formalities here.

While we were entering the dining place, at the entrance of the two adjacent bamboo cottages, we found to our utmost surprise two plaques with my name and Malati's name. We were to inaugurate these two cottages in the afternoon. We wonder whether we really deserved that honour. The whole matter was kept as a closely - guarded secret by all those concerned till the last moment, as Krishnamurty knew our attitude in such matters. As the marble stones with inscriptions were already plastered, at that last minute, there was no question of saying anything but to accept with grace and smile. Krishnamurthy is a great soul and rarely do we come across such noble spirits.

At two-fifteen the jeep arrived. Parvati, Hemalatha's sister from Hyderabad, and Krishnamurthy got down from the jeep. Soon after their late lunch, we went to the spot where afforestation scheme was being implemented - the same spot which we visited two days earlier. On the slope of a hillock, the silver oak was planted in a systematic way to check the washing away of the top-soil. Soil Conservation and Environmental Protection are most essential for the survial of Man - he has to pay heavily for his reckless interference with Nature's ways.

Krishnamurthy explained to us: "Water-shed in common parlance is the catchment region of a river or a stream that drains into it. In 1932 Nizamsagar Reservoir was constructed with an estimated life-span of one hundred years but it has been rendered useless by 1972. Sileru, Nagarjuna Sagar and Pochampadu will meet the same fate if the catchments are subjected to maltreatment. The increase in sediment rate is due to Man's negligence and reckless behaviour with the bounty of nature and his constant interference, with greed and avarice to destruct the forests for personal profits. Machkund is an important

interstate river of Orissa and Andhra Pradesh and the hydro-electric project fetches an annual income of six crores. For the control of silting at the Machkund Reservoir. a comprehensive plan of soil conservation has been taken up. Engineering works like terracing, building gully-plugging, afforestation with silver oak and eucalyptus are in constant progress. Man is a part of ecosystem with geo-bio-chemical functions of life.'' He inaugurated the tank wherein the flow of top soil would be checked with no damage to the upper layer by the flow of rain water. It was a sight to see the silver oak seedlings aprouting in the polybags.

After three memorable days at Araku we took leave of Vasudeva Rao with a heavy heart - he made Araku a perpetual green memory to us. We are indebted to him for all the pains he took and his association has enriched our lives. Joseph from Visakhapatnam joined us and the party drove to Paderu where Somasekhara Reddi would take care of us. We entered Paderu about seven-thirty. After refreshments we were at the shuttle-cock court. While some of us played, the others watched. Nirmala (Mrs. Somasekhara Reddi) and Hemalatha (Mrs Krishnamurthy) were very good at the game. After an interesting number-game, we had dinner and retired for the night.

## THURSDAY

Smruti Patha Vana Chaitanya is the name of a memorial park at Paderu. You can plant a tree the name of the dear departed and the Forest Department will take care of it. The name of the departed soul along with the donor's name will be written on a stone at the foot of the tree. The park is well-maintained by the Forest Department and you are welcome at any time of the year to have a look at the tree you have planted with your own hands. The idea has a dual purpose - you adopt a tree to preserve the memory of the departed one and it is not just for yourself but with a broader social objective. All of us were thrilled at this unique venture and suggested that every village, every town and every city should have a memorial of this nature. For an ordinary citizen to contribute a sum of rupees one hundred to

preserve the memory of the departed forever green is not a big amount.

"If it is just black granite, the inscription costs about fifty - if it were marble, it comes two hundred-and-fifty or so. The contribution is only towards the cost of the slab - not for rearing the tree. That is done free of cost by us," said Somasekhara Reddi.

Every one in the party had a tree planted in the name of their departed ones with contributions varying from fifty to two-hundred-and-fifty. We spent about ninety minutes in that slanting park and each one fervently hoped to visit the place again.

From Smruti Patha Vana Chaitanya we proceeded to Kummerput Nursery, a nursery for pines. In polybags of 150 in a row there were about twenty rows - a beautiful sight. Krishnamurthy explained to us how the plants are nursed in the plastic bags, then planted and reared, the casualities, the final growth etc. In the adjoining Pinetum we found rows of majestic pines and eaucalyptus. Every year about 3 lakh eaucalyptus seedlings in polybags are supplied free of cost - they are given for mere asking. Several men and women are engaged in this silent task - like the ants and the bees.

Our next visit was to Lolbugadda Timber Depot. Hundreds of trees of different ages were there. We were shown a tree and asked to estimate its probable worth in rupees.

Malati said three thousand. Parvati made it four. Sarojini enhanced it to five. Hemalatha was silent. Visalakshi said she couldn't guess. Premchand and DN Rao put it at seven. I brought it to six. "Now that everybody's chance is over, let me tell you it costs anything above fifteen thousand," said Krishnamurthy. Somasekhara Reddi and Joseph found out the circumference of the tree and gave the figure. On a piece of paper they did some calculations and quoted the price at eighteen thousand rupees.

"Count the number of trees in this protected forest and you will know for yourself the approximate wealth. Where wealth is there, pilfering is inevitable. So, the authorities have to keep a constant vigil," said Krishnamurthy.

After lunch and a brief respite we went to the Minumaluru hilltop. It is a winding path and the slopes of the

hill are intended for coffee plantation.

Tenneti Viswanatham, while working as Chairman of the Coffee Board at Bangalore, must have seriously thought of improving the lot of tribals by increasing the coffee plantations area in this region. Any officer attached to the coffee plantation will tell you what a great constructive role Tenneti had played true to his Gandhian ideals. I had the good fortune of calling on him at Visakhapatnam on three or four occasions. He had an open mind with a fund of knowledge and compassionate understanding. May be he was pushed out of politics to do some ever-lasting good to these innocent tribal people.

Coffee is an ever-green shrub or small tree which produces fruit resembling cherries. The dried seed is called coffee bean. Coffee drinking spread to Europe from Arabia. Brazil tops the list in coffee plantation and in South India it was introduced by the Collector of Salem at Yercaud in the second half of the last contury During 1961-'78 an area of about 1279 hectares was brought under coffee cultivation in Visakhapatnam District. The Girijan Corporation and other public bodies are there to give gainful employment to the tribals. The Andhra Pradesh Forest Department has been doing its best for the uplift of the people in this region. Labour colonies have come up. About 2400 houses have been constructed by the Forest Board. The Girijan Corporation has been doing its share of welfare work.

We start our morning with a cup of coffee. Let me tell you a few facts I have gathered. In India we produce 1 lakh 50 thousand tonnes of coffee which is about 2% of the world crop. Internal consumption is about 50 thousand tonnes and the balance of one lakh tonnes is intended for expert. Of this fifty thousand tonnes, only 350 tonnes are grown here and the export commitment is only 40 tonnes considering the quality and other factors. Average cost to the grower comes to about Rs. 15/- per kg and in the internal market it is sold at Rs. 12/- per kg and for export purpose Rs. 24/- per kg. All the produce is channelled through the Coffee Board. The beaming smiles on the faces of these tribals are indicative of their well-being and prosperity. The next morning we were to leave

for Chintapalli - a place deep in the forest.

## FRIDAY

After the usual heavy breakfast, Joseph and DN Rao left for Visakhapatnam while the rest of us took leave of Somasekhara Reddi and his charming wife, Nirmala who was our hostess at Paderu, and proceeded towards Chintapalli. Our next halt on the way was Vanga Sara. We saw how the processing of coffee is done through pulpers. There are sixteen varieties of coffee beans. Pepper also is extensively cultivated in these parts. Coffee cultivation was given a boost to avoid the age-old custom of podu-cultivation (burning the place after the growth of a crop). Soil conservation and afforestation schemes go side by side. Way back in 1954 one Raghavendra Rao of the Forest Department dedicated his life to the coffee plantation in this region and in his memory stands RV Nagar. His pioneering work was mentioned by every one we came across. To our amazement, all relevant figures and details were on the finger-tips of Subbaraghaviah.

We had our lunch at Chintapalli bungalow where we were to stay for the night. After lunch we rested for a while and accompanied Ramachandra Rao to his farm. Our friend Premchand's brother-in-law Ramachandra Rao, is a highly-educated man who left off a comfortable job to settle down at Narasipatnam and grow citronella. It is a scented grass plant from which oil is extracted for use in cosmetics. The urge and drive in him are inexplicable. May be he wanted to be nearer nature, close to the people of the soil and Mother Earth. He showed us the extraction plant, his dwelling cottage and all that. The crop should be grown only by the tribals. Just like any other individual enterprise he had his problems and he is braving through them with a cheerful disposition. His devotion to the work taken up and the faith in the people around him were evident on his face.

From there we proceeded to Lamba Singi. The Forest Department bungalow on the hillock has retained its colonial appearance. Though electrified and well-furnished, it had an eerie atmosphere. Little did I dream that I would ever set foot on this historical place where Rutherford was said to have camped to capture Alluri Seetaramaraju. It was

a thrilling experience. As a boy I read his escapades and as a grown-up, I read a lot of controversial material about him. I saw the picture enacted by Superstar Krishna,- liked the picture in parts but not in full. In my opinion Seetaramaraju was a saintly person who espoused the cause of girijans. He saw with his own eyes the gross injustice done to them by exploitation. He revolted on their behalf and passed away into history as a rebel-hero who defied the British authority. Linking him with the freedom struggle of passive resistance has little factual evidence.

Peketi Sivaram was telling me a long time back how the entire unit of Padmalaya spent about forty days with their improvised tents, generators and other equipment while carrying on the shooting of the Alluri Seetaramaraju picture in this Lamba Singi area.

"This is the place where Jaggiah stood as Rutherford and those are the steps where Krishna stood with his bow and arrows," said Krishnamurthy.

It was a pictorial presentation of an episode to heighten the depth of real drama. At this distance of time fact and fiction merge together.

While our thoughts were with thep ast, the ladies just then returned from a stroll in the village. They came across a lady-member of the local samiti and encuired of her the social and economic conditions of the village folk.

At seven-thirty as darkness was enveloping, we left Lamba Singi for our bungalow to fall into a game of cards. And during that cards-session the topic of Naxalites came up.

"Word must have already spread that we are at Chintapalli and Malati Chendur also is in this party," said Krishnamurthy.

"Do we have occasion to see them?" asked Malati.

"If only they intercept our vehicles when we proceed tomorrow through the maze of forest to reach the highway. That would never happen. They observe the rules of the game and they have their code of conduct," said Subbaraghaviah.

After a lapse of five minutes the topic came up again

**— NR Chendur**

*(to be concluded*

